# విషయ సూచిక



నెహ్రూ భారతదేశానికేగాక సర్వమానవ జాతికి చెందుతాడు. సమకాలీన అంతర్జాతీయ సంబంధాల రూప శిల్పులలో ఆయన ఒకరు. నూతనంగా విముక్తి పొందిన దేశాల యొక్క మరింత క్రియాశీలత యీ సంబంధాల్లో ఈనాడు వున్నదని నిర్వచించబడుతున్నది. అలీన ఉద్యమ, ఉద్రిక్తతల ఉపశమన విధానాన్ని రూపొందించిన వారిలో ఒకరైన జవహర్‌లాల్ నెహ్రూ మానవాది ఉమ్మడి భవితవ్యాన్ని, ప్రాక్-పశ్చిమ సయోధ్యను విశ్వసించారు.

# మహా యోధుల నక్షత్ర మండలం నుండి

జవహర్‌లాల్ నెహ్రూ వంటి రాజకీయ మహామేధావుల జీవిత చరిత్ర ఈ యుగం చరిత్రలోభాగం అవుతుంది. ఈ కారణంగానే ముఖ్యంగా ఒక వ్యాస సంపుటి రూపంలో, ఆయన స్థాయి గల చారిత్రక పురుషులను గురించి వ్రాయడం అన్నది చాలా కష్టం అవుతుంది.

తన ప్రజల ప్రయోజనాలకోసం పోరాడిన మహాయోధుడైన నెహ్రూ తన దేశచరిత్ర, అలాగే ప్రపంచ చరిత్రల యొక్క విశిష్టసమయంలో వారి ఆశలను ప్రతిధ్వనించాడు. 20వ శతాబ్దాన్ని రూపుదిద్దిన నాటకీయమైన సామాజిక మార్పులు, విప్లవాత్మక వెల్లువలు కూడా భారత ప్రజలకు అపూర్వమైన అవకాశాలను ఆవిష్కరించాయి. ఈపరివర్తనలు ఎక్కువభాగం భారత దేశంలోని జాతీయవిమోచన విప్లవం, భారతదేశ మహత్తర పుత్రుల, నాయకుల కృషి వల్ల తీసుకరాబడినాయి. చెరిగిపోని వారి శాశ్వత సేవలు, వారి బౌద్ధిక, ఆచరణాత్మక కృషి యీనాడు మనం చూస్తున్న యీ ప్రపంచం ఆవిర్భావానికి దోహదం చేశాయి. పునరుజ్జీవం పొందిన, సత్యపరిణామశీలమైన ఈ ప్రపంచంలో నేటి భారతదేశం యొక్క ప్రతిబింబం వారి పోరాటఫలితం; అలాగే యీనాటి భారతం వారి భావనల, విజయాల సజీవ చిరస్మరణీయ మందిరం.

జవహర్‌లాల్ నెహ్రూ జీవితం, ఆయన భావనలు, సాహస కృత్యాలు, ఆయనకు సంబంధించిన వాస్తవాలు, ఘటనలు చరిత్రలో భాగం అయినాయి; ఏ మాత్రం అవి మార్పులకు గురికావు. కాలం గడిచేకొలదీ ఆయన వ్యక్తిత్వంలోని వైభవాలను మనం శ్లాఘిస్తాము.

గత చరిత్ర, మన మానసిక చరిత్రలో, భావనలలో సజీవంగా తొణికిసలాడుతున్నట్లు కనపడుతున్నది. తన ఘనకార్యాలతో, కొన్ని సందర్భాల్లో అయితే సిద్ధించిన జోశ్యాలతో మన ఊహలను సంతరించుకొని అది వర్త

మానంలోనికి అడుగిడుతున్నది; మనం అప్పుడు గతం, వర్తమాన వాస్తవంల మధ్య వున్న అవిచ్ఛేదబంధాన్ని గమనిస్తాం; చరిత్ర మనదేనని గుర్తించడం ప్రారంభిస్తాం; వర్తమాన కాలంలో దానిపై మనకు పట్టు, ఆధిపత్యం కలిగి వున్నప్పుడు, అలాగేదానిని భవిష్యత్తులోనికి ప్రవేశపెట్టినపుడు అది సజీవమూ, క్రియాశీలమూ అవుతుంది.

జవహర్‌లాల్ నెహ్రూ, యీచారిత్రకబంధం గురించి బాగా ఎరుగును' రాజకీయవాది కాబట్టి ఆయనకు చరిత్ర తెలుసును; ఆయన దానిని ప్రేమించాడు. దైనందిన జీవితానికి, అలాగే చారిత్రక పోరాటాలకు దానిని అనువర్తింపచేశాడు. ఆయన యిలా వ్రాశారు: "ఆ వర్తమానంయొక్క మూలాలు గతంలోనే వున్నాయి. అందువలన నేను వర్తమానకాలాన్ని అవగాహన చేసుకొనడానికి వీలుగా ఏవైనా జాడలు వున్నాయేమో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూ గతంలోనికి సందర్శనాప్రయాణాలు చేశాను".1 నెహ్రూ చెప్పినట్టుగా గతం అనే ఎండిపోయిన ఎముకలకు రక్తమాంసాలు నింపేందుకు ఆయన ప్రయత్నించాడు.2

చరిత్ర అంటే ఆయనకు అతిప్రియమైనది గాబట్టి, అలాగే నూతన భావనలు, గతకాలపు అంశాల విశ్లేషణలచేత ఆయన ఆకర్షితుడు అయినాడు. కాబట్టి, అన్నిటికీమించి ఆయన కార్యాచరణను ప్రేమించాడు. "విపత్కరంగా, ప్రమాదకరంగా మారే మృత్యువును ఎదిరించి, పరిహసించే మనోజ్ఞమైన ఆనందోద్వేగాలను" అనుభవించాలని ఆయన కోరుకున్నాడు.3

తన దేశభక్తియుత కర్తవ్యపరిపూర్తికి సంబంధించినంత వరకు జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశ జాతీయనాయకుడు; అంతర్జాతీయ కార్యకలాపాలకు సంబధించి ఆయన ప్రసిద్ధ శాంతియోధుడు, ప్రపంచస్థాయి రాజకీయ మహామనీషి; ఆయన కుమార్తె శ్రీమతిఇందిరాగాంధీయుక్తంగా వ్యాఖ్యానించినట్లుగా మానవునిగా ఆయన స్వభావాన్ని బట్టి చూస్తే ఆయన ఒక కవి.

జీవితాన్ని ప్రేమించేవాడుగా, "దాని అంచులను తొంగిచూసేందుకు, దానికి బానిసగా మారకుండా వుండేందుకు" ఆయన ప్రయత్నించాడు4. ఆయన యిలాఅన్నాడు: "జీవితంలో మాంద్యాన్ని, చురుకుదనంలేమిని అధిగ

---

1. జవహర్‌లాల్ నెహ్రూ, భారత దర్శనం- జాన్ డే కంపెనీ, యన్. వై. పుట 11.
2. అదే పుస్తకం పుట 12.
3. అదే పుస్తకం పుట 10.
4. అదే పుస్తకం.

మించడానికి పిలుగా కల్లోలిత మేఘాకాశంలోనికి పరుగులెత్తేందుకు బహుశా నేను వైమానికుణ్ణి అయ్యేందేవాణ్ణి. నాకు నేను యిలా చెప్పుకున్నాను:

"అన్నింటినీ పరిశీలించి చూశాను నేను.
అన్నింటినీ నా మస్తిష్కంలోనికి తెచ్చుకున్నాను నేను,
రానున్న వత్సరాలు వృధాగా గోచరిస్తున్నాయి,
కరిగిపోయిన వసంతాలు అలాగే వున్నాయి
ఇక మిగిలిపోయింది జీవితం, మృత్యువు."1

జవహర్‌లాల్ నెహ్రూ తన జీవితం చరమ దశవరకు గాలిగుమ్మటాల్లో విహరిస్తూ ఆనందించేవాడు. ప్రమాదాన్ని లెక్కచేయక నీలాకాశంలో ఎంతో ఎత్తున ఎగురుతూ ఎంతో సంతోషించేవాడు. ఢిల్లీ పరిసర గ్రామాలపై స్వేచ్ఛగా విహరిస్తూ సాహస భావంతో సంతసించేవాడు; దివ్యమైన ప్రపంచాన్ని నేరుగా వీక్షించేవాడు.

జవహర్‌లాల్ నెహ్రూ స్మృతి మన చరిత్ర భావనను సంపద్వంతం చేస్తుంది. ఇది మన కాలంలో జాతీయ సరిహద్దులను దాటివెడుతుంది. అధికారికంగా ప్రపంచ స్వభావాన్ని సంతరించుకొంటున్నది. దీనిని మనం అర్థం చేసుకొంటాం: ప్రపంచం మరింత సమైక్యంగా రూపొందుతున్నది. వివిధ దేశాల ఉమ్మడి భవిత్యంపై యిది ఆధారపడివున్నది.

దేశాల ప్రపంచవ్యాపిత పరస్పర కార్యాచరణ శీఘ్రగతి అభివృద్ధి కారణంగా (రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, పర్యావరణ, యితర రంగాల్లో) భారతీయులు, రష్యన్‌లు, అమెరికన్లు, ఫ్రెంచ్‌వారు, స్పెయిన్‌వారు, అరబ్‌లు, యూదులు మొదలగువారు సహచర భూగోళవాసులుగా, తృతీయ సహస్రాబ్ది ప్రాంగణంలో ఉమ్మడి ప్రపంచ సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఈ సమస్యల్లో ప్రధానమైనది కొత్త ప్రపంచ యుద్ధాన్ని నివారించి, భావితరాలవారికోసం ఈ భూమండలాన్ని సంరక్షించడం.

జవహర్‌లాల్ నెహ్రూ అకలంక భారతదేశ భక్తుడు; అయినప్పటికీ ఆయన రాజకీయ కార్యకలాపాల ప్రాముఖ్యత తనదేశ సరిహద్దులను దాటి వ్యాపించింది. ఆయన విధానాలు, మానవతావాద, నైతికసూత్రాలు గుణాత్మకమైనవి; సర్వజనావళికి ప్రీతిపాత్రమైనాయి; ప్రపంచవ్యాపిత ప్రాముఖ్యత గలదిగా రూపొందాయి.

దాదాపు 30 సంవత్సరాలపాటు నెహ్రూ తన ప్రజల స్వాతంత్ర్య పోరాటం జయప్రదం అయ్యేందుకు అవిశ్రాంతంగా, నిస్వార్థంగా కృషి

1. అదే పుస్తకం.

చేశాడు. ఈ పోరాటం 1947 ఆగస్టు 15న భారత స్వాతంత్ర్యసిద్ధిగా పరాకాష్ఠనందుకున్నది. ఈ తేదీ నెహ్రూ జీవితంలోని నూతన, మహోన్నత సాహసోపేత దశకు నాందిగా వుంటుంది: 17 సంవత్సరాలపాటు అనగా 74 వ యేట 1964 మే 27 న ఆయన అస్తమించేంతవరకు నెహ్రూ భారత ప్రభుత్వాధినేతగా కొనసాగాడు. ఉన్నత విద్యాధికుడు, సహజసిద్ధమైన ప్రతిభావ్యుత్పత్తులు కలిగినవాడు, ప్రపంచ చరిత్ర, సాహిత్యాలలో ప్రగాఢమైన ఆసక్తి కలవాడుగాబట్టి జవహర్‌లాల్ నెహ్రూ ఒక్క రాజకీయాలకే ఎన్నడూ పరిమితం కాలేదు. సర్వవిజ్ఞానఖని, వివేకవంతమైన రాజనీతిజ్ఞుడు, పట్టువిడుపులున్న మనసుగల వృత్తిపరమైన రాజకీయవాది అయిన నెహ్రూ ఉన్నత సచ్ఛీలతగల వ్యక్తి; అంతరంగంనిండా ప్రేమ, మనోహరత్వాలు మూర్తీభవించిన మనీషి; ఉద్వేగం, నాటకీయమైన స్వభావంకల వ్యక్తి. సత్యాన్వేషణలో ధృఢంగావుండీ, సందేహాలను నిర్మొహమాటంగా దీర్చుకొంటూ, తన లక్ష్యసాధనలో అచంచల విశ్వాసాన్ని ప్రకటిస్తూ, సహేతుకంగా వెనక్కు తగ్గడానికి యిష్టపడుతూవుండే నెహ్రూ సర్వదా సామాజిక అభ్యుదయంలో విశ్వాసం కలిగివుండేవాడు; క్షణికమైన రాజకీయ లాభాలకంటే ప్రజల మౌలిక ప్రయోజనాలు ఉన్నతమైనవిగా యెంచేవాడు. నెహ్రూ భావుకుడు, తత్వవేత్త.

నెహ్రూ తన అంతర్జాతీయ కార్యకలాపాల్లో శాశ్వత ప్రపంచశాంతిని, ప్రపంచ సమాజంలో అసమానతను నిర్మూలించడం అన్న వాటిని లక్ష్యంగా యెంచుకున్నాడు. అనివార్యమైన యీ లక్ష్యంనుండే ప్రచ్ఛన్న యుద్ధాన్ని అంతమొదించే, అంతర్జాతీయ సంబంధాల్లో విభిన్న సామాజిక-ఆర్థిక-వ్యవస్థలు గల రాజ్యాల శాంతియుత సహజీవన సూత్రాలను సాధించే పంథాను, అలాగే సైనిక - రాజకీయ కూటములలో అలీన విధానాన్ని అనుసరించే పంథాను అనుకరించారు. భారత, సోషలిస్టు దేశాల మధ్య క్రియాశీలమైన పరస్పర లాభదాయకమైన సహకారం కోసం, సోవియట్ యూనియన్‌తో మైత్రీబంధాలు పెంపొందించేందుకు ఆయన కృషి చేశాడు.

ఈనాటి అంతర్జాతీయ సంబంధాల వ్యవస్థ రూపశిల్పులలో నెహ్రూ ఒకరు. ఈ సంబంధాల్లో నూతనంగా విముక్తి పొందిన దేశాలు ఉన్నతమైన క్రియాశీలతన ప్రదర్శిస్తున్నాయని చెప్పబడుతున్నది. అలీన ఉద్యమ నిర్మాత కాబట్టి, వలసవాద బంధనాలను తుత్తునియలు చేసిన ఆఫ్రో - ఆసియా దేశాల మధ్య అంతర్జాతీయ సంఘీభావాన్ని చిత్తశుద్ధితో ప్రచారం చేసినవాడు గాబట్టి ఆయన ఎన్నడూ దేశం ఒంటరిగా వేయబడి వుండాలనికానీ, పగసాధింపు

గానీ కోరలేదు. నెహ్రూ మానవాళి ఉమ్మడి భవితవ్యాన్ని, ప్రాక్ - పశ్చిమ సయోధ్యను విశ్వసించాడు. వాటి మూలాలు లేదా నినాదాలు యేవైనప్పటికీ జాతీయ దురహంకారాన్ని, అలాగే అగ్రరాజ్య దురభిమానాన్ని తిరస్కరించాడు. జాతిజనులమధ్య జగడాలకు, మత అసహిష్ణుతలకు వ్యతిరేకంగా నిల్చి పోరాడిన తిరుగులేని యోధుడు జవహర్‌లాల్ నెహ్రూ.

అపారమైన అంతర్జాతీయ పేరు ప్రతిష్టలను పొందిన, మహత్తర ప్రజల, దేశంయొక్క నాయకుడుగా నెహ్రూ తన విధానంలో, వర్ధమాన దేశాలకు సంబంధించిన అనేక కీలక ప్రాముఖ్యతగల సూత్రాలను యిమిడ్చాడు; ఆ విధంగా నాటి రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యానికి ప్రత్యక్ష దోహదం చేశాడు.

నెహ్రూ రాజకీయ వారసత్వం ఒక్క భారతదేశానికేగాక యావత్తు మానవాళికి చెందుతుంది. అతని వారసులు, భారత ప్రజలయొక్క ఎన్నికైన ప్రతినిధులు సంక్రమింపచేసుకొన్న నెహ్రూ విధానం మరింత అభివృద్ధి చేయబడింది; మన శీఘ్రంగా మారుతున్న ప్రపంచంలో ఇది మారాకులు వేస్తున్నది. 1986 నవంబరులో భారతదేశం, సోవియట్ యూనియన్‌లు అణ్వస్త్రరహిత, అహింసా ప్రపంచ స్థాపనకు సంబంధించిన సూత్రాలపై ఢిల్లీ ప్రకటనపై సంతకాలు చేశాయి. మానవ జీవితాన్ని అత్యుత్తమ విలువగా యిది గుర్తించుతుంది; అంతర్జాతీయ సంబంధాల్లో అహింసకై యిది పిలుపునిస్తున్నది; ఈ అహింస మానవ సమాజంయొక్క జీవన ప్రాతిపదిక, ఆధారం అని ఢిల్లీ ప్రకటన తెలుపుతున్నది."ఢిల్లీ ప్రకటనలోని అణ్వాయుధ రహిత అహింసాయుత ప్రపంచ సంస్థాపనకు సంబంధించిన మా తాత్విక, రాజకీయ దృక్పథం, అలీన విధానం ప్రాతినిధ్యం వహించే మహత్తర భారతదేశం, కోట్లాదిమంది ప్రజల దృక్పథంతో సమ్మిళితం అవుతున్నది" అని సోవియట్ నాయకుడు మిహాయిల్ గొర్బచెవ్ అన్నారు.1

యుద్ధాలు, ఆయుధాలులేని భావిప్రపంచ రూపం, నెహ్రూ స్వప్నాన్ని, ప్రపంచంలోని ఉత్తమ ఆలోచనాశీలుర మానవజాతిలోని ఉత్తమ ప్రతినిధుల ఆశలు ఆకాంక్షలను, శాంతి, స్వేచ్ఛ, సామాజిక న్యాయం, అభ్యుదయాల

1. మిహాయిల్ గొర్బచేవ్, మానవ నాగరికత సంరక్షణకోసం, "అణ్వస్త్ర రహిత ప్రపంచం కోసం, మానవాళి మనుగడకోసం" విషయాల అంతర్జాతీయ సదస్సులో పాల్గొన్న ముందు చేసిన ప్రసంగం", 1987 ఫిబ్రవరి 16, నోవోస్తి ప్రెస్ పబ్లిషింగ్ హౌస్, మాస్కో, 1987.

కోసం నిలబడే ప్రపంచంలోని చిత్తశుద్ధిగలిగిన అందరి ప్రజల వాంఛతో సోషలిజం యొక్క శాస్త్రీయ భావనలను సమ్మిళితం చేస్తుంది.

ప్రతిదీ నైమిత్తికం,అప్రధానమూ అన్న నెహ్రూ భావనలు ఈ కాలంలో అంతరించి పోయాయి. ఈనాడు ఆయన మహత్తర మోదుల నక్షత్రమండలానికి చెందిన మహా మనీషిగా మనముందు నిలుస్తున్నాడు. ఈ నక్షత్రమండలానికి మన నాగరికత ఎంతో ఉపకారం చేయవలసివుంది. మానవ విలువలను, రాజకీయ సంస్కృతిని, నీతి నియమాలను, హేతువాద విజయాలను పదిలపరచి, పెంపొందించడం అన్నదే యీ ఉపకారం.

# ఈ యుగము, జీవితంలోని ప్రధాన ఘట్టాలు

ఒకరి జీవితంలోని ప్రధాన ఘట్టాలు సంపూర్ణ జీవితాన్ని చిత్రించలేవు; అవి కాలం, దేశచరిత్రలో సాగిన దానియొక్క ఘటనాక్రమాలు, దశలే. అయితే ఒక మానవునియొక్క జీవితం ఈ వాస్తవ ప్రపంచంలో ఒక విశిష్టమైన దృగ్విషయం. దీనిని సమగ్రంగా అవగాహన చేసుకొనేందుకు రెండు ప్రమాణాలు చాలవు. కాలముగానీ దేశమాన పరిస్థితులుగానీ ఒక వ్యక్తియొక్క ఆత్మిక ప్రపంచాన్నిగానీ, నైతిక సూత్రాలనుగానీ కొలవలేవు. అతని నైతిక ప్రమాణాన్ని, అతడు దుష్టభావనలకు లొంగుతాడా లేదా అన్న అంశాన్ని, అతను పవిత్రంగా యెంచే అతని ఆదర్శాలను, నిత్యము, ఉత్తమము అన్న విషయాలకు సంబంధించిన అతని భావనలను, అతని విజ్ఞానం, సంస్కృతుల స్థాయిని, అతని సామాజిక మార్గదర్శక సూత్రాలను, పోరాడేందుకు, తనను తాను అర్పించేందుకుగల అతని అభీష్టాన్ని మనం తెలుసుకొనవలసిన అవసరం వుంది. ఒక మానవునియొక్క అంతర్ముఖ ప్రపంచాన్ని అర్థం చేసుకొనడానికి వీలుగా మనం అతని వైయక్తిక వైశిష్టాన్ని అవగాహన చేసుకోవాలి; కోట్లాది మంది ప్రజల్లో అతని వ్యక్తిత్వాన్ని క్షీరసీర న్యాయంగా తెలుసుకోవాలి.

చారిత్రక పరిస్థితి, రాజకీయాలను జీవనంగా తాను ఎంపిక చేసుకొనేట్టు చేసిందన్నది జవహర్‌లాల్ నెహ్రూ విశ్వాసం. అంటే దాని అర్థం కేవలం ఆయా ఘటనల వరుసక్రమం కాదు, వేరువేరు సంఘటనలు కాదు; తాను జన్మించిన, జీవించిన చారిత్రక శకం యొక్క విలువలు మాత్రమే.

20వ శతాబ్దం ప్రాంగణంలో జవహర్‌లాల్ నెహ్రూ జన్మించాడు. ఒక నూతన శకం ఆవిర్భవించింది. అది సాంప్రదాయక వ్యవస్థలను నాశనం చేస్తూ వుండింది. అదే సమయంలో మరింత మెరుగైన జీవనం, మరింత న్యాయమైన ప్రపంచ వ్యవస్థకోసం ఆశలు రేకెత్తించుతూ వుండింది.

19వ శతాబ్దం చివరకు శాస్త్రీయ కమ్యూనిజం సంస్థాపకులు లేదా వైతాళికులు కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్ తమ మూల గ్రంథమైన

కాపిటల్‌ను పూర్తిచేశారు. గతితార్కిక, చారిత్రక భౌతిక వాదాలను విశదీకరించారు. రష్యాలో యువ వ్లాదిమిర్ ఉల్యనోవ్ (లెనిన్) సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో (నేటి లెనిన్‌గ్రాడ్) శ్రామికవర్గ విముక్తి పోరాట సంస్థను అప్పటికే స్థాపించాడు. రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీని సంస్థాపించేందుకు సన్నాహాలు చేస్తూ వున్నాడు.

శాస్త్ర, సాంకేతిక రంగాల్లో మహత్తర నూతనాన్వేషణలు, కళ, సాహిత్యాలలో నూతన ధోరణులు, యీ సమయంలో స్వతంత్ర జీవనాన్ని ప్రారంభించిన జవహర్‌లాల్ నెహ్రూ లాంటి వ్యక్తుల మనస్సులను నూతన భావాలతో ప్రేరణ కలిగించాయి.

చార్లెస్ డార్విన్ ఈ సజీవ ప్రపంచ పరిణామాన్ని శాసించే సూత్రాలను అన్వేషించారు; మానవుడు, వానరంలాంటి తన పూర్వీకులనుండి ఆవిర్భవించాడన్న తన ప్రతిపాదనతో ఆయన మత నాయకులను, రీతి రివాజు పాటించే పైనవున్న వర్గాలను వ్యాకులపరిచారు. ఐన్‌స్టీన్ యొక్క సాపేక్ష సిద్ధాంతం, అప్పటికున్న కాలమానదేశ పరిస్థితులలోని ప్రజల పూర్వపు అభిప్రాయాలను తల్లక్రిందులుగా మార్పుచేసింది.

వాస్తవం చెప్పాలంటే ఈ భూమండల చిత్రపటాన్ని శీఘ్రంగా పరివర్తన చెందిస్తూ, ప్రజల చైతన్యాన్ని తిరిగి రూపు కట్టిస్తూ కాలం క్షణాల మీద గడిచిపోతున్నట్లు కనిపించింది; ఈ యుగం మహోన్నత భావుకులు, ఆలోచనాశీలురు, పరిపాలనాధ్యక్షులు, యోధులు ఎందరికో జన్మనిచ్చింది: అలాంటి వారిలో జర్మనీలోని మార్క్స్, ఎంగెల్స్, రష్యాలోని లెనిన్, భారత దేశంలోని మహాత్మాగాంధీ, నెహ్రూ, చైనాలోని సన్‌యెటోసేన్, మొదలగు వారు వున్నారు.

నెహ్రూ భారతదేశానికేగాక సర్వ మానవాళికి చెందుతాడు. సమకాలీన అంతర్జాతీయ సంబంధాల రూపశిల్పులలో ఆయన ఒకరు. నూతనంగా విముక్తి పొందిన దేశాలయొక్క మరింత క్రియాశీలత యీ సంబంధాల్లో ఈనాడు వున్నదని నిర్వచించబడుతున్నది. అలీన ఉద్యమ. ఉద్రిక్తతల ఉపశమన విధానాన్ని రూపొందించిన వారిలో ఒకరైన జవహర్‌లాల్ నెహ్రూ మానవాళి ఉమ్మడి భవితవ్యాన్ని, ప్రాక్-పశ్చిమ సమైక్యను విశ్వసించారు.

ప్రజా జీవనం మారుతూ వచ్చింది. ప్రజలు విద్యుత్ దీపాలతో తమ ఇండ్లలో వెలుగును నింపడం ప్రారంభించారు; మోటారు కారులు రోడ్లమీద తిరగడం ప్రారంభించాయి; ప్రథమ విమానం విహాయసంలో విహరించింది;

టెలిఫోన్లు, సినిమా అస్తిత్వంలోనికి వచ్చాయి; రేడియోను అన్వేషించడంతో మానవుడు ఎంతో సుదూరానవున్న తన వాణిని ప్రసారం చేయడానికి అవకాశం కలిగింది. గ్రామీణ శిల్పకళకు సంబంధించి పురాతన చర్చిలు, దేవాలయాల్లో పారిశ్రామిక భవనాలు దర్శన మివ్వడం ప్రారంభించాయి. నదులు, రసాయన కర్మాగారాల విషతుల్య వ్యర్థ పదార్థాలతో కలుషితంగావడం ప్రారంభం అయింది. ప్రజలు, కృత్రిమ దారాలతో తయారుచేసిన వస్త్రాలను ధరించడం, రైళ్ళలో ప్రయాణాలు చేయడం ప్రారంభించారు. మారుతున్న జీవనందృష్ట్యా ఇనుము, ఉక్కు, బొగ్గు, చమురులకు అధిక గిరాకీ ఏర్పడింది. వినిమయ వస్తువులు, యంత్రాలు విస్తృతంగా ఉత్పత్తులు చేయడం ప్రారంభమైంది.

ప్రపంచ సంపద పెరిగేకొలదీ ప్రజాజీవనం, అంతకుముందున్న దానికంటే మరింత క్లిష్టమూ, కష్టతరముగా తయారైంది; ఇది చేదు జీవితంగా, పడిపోతున్న విలువలు కలదిగా తయారైంది.

ప్రకృతి అధ్యయనంలో విజ్ఞానశాస్త్రం ఎన్నో మహత్తరమైన విజయాలు సాధించింది; అయితే సమాజం గురించి దానికి తెలసిందేమిలేదు. ఆత్మ గురించిన పూర్వపు మాయా, కల్పిత భావనలను యిది ఖండించినా యీ క్రింది ప్రశ్నలకు సమాధానం యివ్వలేక పోయింది: ఎందుకు జీవిస్తున్నాము? అలాంటి జీవనం యొక్క పరమార్థం యేమిటి? (బాహ్య పరిసర ప్రాంతాలలో అంతర్చర్య, పరస్పర కార్యాచరణ ఒక్కటి మాత్రం కాదు?!) మనం దేనిని విశ్వసించాలి? (వచ్చే ప్రపంచం యొక్క ఆశల్లో మనం నిజంగా జీవిస్తామా?!)

ఈ ప్రశ్నలకు యువకుడైన జవహర్‌లాల్ నెహ్రూ సమాధానాలు వెతికాడు. భారతీయులు, వలసవాదుల నుండి యీ ప్రశ్నలకు సమాధానాలను కోరుతూ తమ పీడిత దేశంలోని నగరాల్లోని వీధులు, కూడలుల్లో ప్రదర్శనలు జరిపారు. దమనకాండ, కొరడాలతో కొట్టటం, నిర్బంధం మరణశిక్షలను అధికం చేయడం ద్వారా వారు యీ ప్రశ్నలకు సమాధానం యిచ్చారు. భారత దేశంలో, తూర్పున దాదాపు ప్రతిచోట వున్నట్టుగా బ్రిటిష్ సార్వభౌమాధికారం తిరుగులేనిదిగా వుంది. అయితే యీ మహత్తర ప్రజల్లో ఆత్మిక, రాజకీయ చైతన్యం రగుల్కొనడం ప్రారంభం అయింది. విజ్ఞానాభివృద్ధి, జాతీయ స్వాతంత్ర్యం, సంతోషాలకై తిరుగులేనివాంఛే యీ చైతన్యజ్వాల

జవహర్‌లాల్ నెహ్రూ తన జీవిత కార్యకలాపాలను ప్రారంభించిన యుగం యిలాంటిది. ఆయన ముందు జాజ్వల్యమైన భవిష్యత్తు వుంది.

ఆయన చుట్టూవున్న పరిస్థితులు, తన స్వంత ఉన్నత ఆశయాలు రెండింటి యొక్క ఫలితమే అతని భవిష్యత్తు.

హిందూ సమాజంలో అత్యంత సంపన్న కులమైన కాశ్మీరు బ్రాహ్మణ కుటుంబంలో అలహాబాదులో 1889 నవంబరు 14 న జవహర్‌లాల్ నెహ్రూ జన్మించాడు.

ఆయన జన్మించడానికి ఒక శతాబ్దం ముందు సంస్కృతం, పర్షియన్ భాషల్లో దిగ్గంతుడైన ఆయన పూర్వీకుడు రాజ్‌కౌల్‌ను ఆఖరి మొగల్ చక్రవర్తి అయిన ఫరూక్ షేసియార్, ఢిల్లీలోని తన ఆస్థానం సమీపంలో నివసించేందుకు ఆహ్వానించాడు. ఒక నదీతీరం మీదవున్న ఎస్టేటుకు రాజును ఆయనకు వ్రాసియిచ్చాడు. అప్పటి నుండే నెహ్రూ అన్నమాట—సంస్కృతంలో నెహ్రూ అంటే నది—ఆయన పేరుకు జోడించబడింది.

1857 - 1859 సంవత్సరాల కాలంలో భారతదేశంలో ప్రజా తిరుగుబాటు సందర్భంగా బ్రిటిష్ దండనా దళాలు తమకు ఎదురు వచ్చినవాటి నన్నింటినీ విచక్షణా రహితంగా ధ్వంసం చేసి, దగ్గపదటం గావించినపుడు నెహ్రూలు సర్వస్వం కోల్పోయారు. చేత చిల్లికానీ లేని నెహ్రూ తల్లిదండ్రులు ఆగ్రాలో తలదాచుకొని, అ తర్వాత అలహాబాదులో స్థిరపడ్డారు.

కుటుంబ పెద్ద అయిన మోతీలాల్ నెహ్రూ అరుదైన ఉత్సాహం గల వ్యక్తి. మహత్తర జీవనాభిలాష గల మనిషి. త్వరలోనే ఆయన ప్రసిద్ధమైన న్యాయవాది అయ్యాడు. భారతీయ రాజులు, సంస్థానాధీశులకు సంబంధించిన సివిల్ కేసులు, ఆస్తి సంబంధమైన ఫిర్యాదులను చూస్తూ చిన్నచిన్న మొత్తాలను వసూలు చేయడం ద్వారా న్యాయవాద వృత్తిని ప్రారంభించిన మోతీలాల్ నెహ్రూ త్వరలోనే ఆరు అంకెల ఫీజును పొందగలిగారు.

1900 సంవత్సరంలో, జవహర్‌లాల్ నెహ్రూ 11 సంవత్సరాల బాలునిగా వున్నప్పుడు ఆయన తండ్రి మోతీలాల్ నెహ్రూ అందమైన అలహాబాదు పరిసరాలలో కోటలాంటి పెద్ద భవనాన్ని కొన్నారు. జీవితాన్ని ఆనందంగా అనుభవించిన మోతీలాల్ నెహ్రూ ఈ భవనాన్ని "ఆనందభవన్"గా ఆనందనిలయం — పిలిచాడు.

కేవలం పది సంవత్సరాల తర్వాత అతని కుమారుడు, ఆ కుమారుడ్ని అనుకరిస్తూ తాను ఆనందభవన్ లోని ప్రశాంతంగా వుండే డ్రాయింగ్ రూములో గాక, వేలమంది ప్రదర్శకుల్లో జీవితానందాన్ని పొందుతారని ఎవరైనా ఊహించ గలిగారా? జవహర్‌లాల్ నెహ్రూ తన జీవిత పరమార్థం ఏమిటో తెలుసుకున్నాడు. నిస్సహాయస్థితిలో, దుస్థితిలో వున్న కోట్లాది మంది

ప్రజలకు సహాయం చెయ్యడం సేవచేయడం: యిదే ఆ పరమార్థం. భవిష్యత్తు తనకై మిగిల్చిన యిక్కట్లలో తాను చేయాల్సిన పని యిదే. అతని తండ్రి, యావత్తు కుటుంబం ఈ పంథా నుండి తనను వారించలేదు. ప్రథమంలో మిత వాదం, తిరుగుబాటుతత్వం, జీవితంలో ఆశావాదం రాజకీయాల్లో నిరాశావాదం జాతీయ ఆకాంక్షలు, ఆంగ్లేయులకు సంబంధించిన ప్రతిదానినీ అనుకరించడం వంటి విచిత్ర సంగమం అయిన అతని తండ్రి అభిప్రాయాలు క్రమంగా వాటి వైరుధ్య స్వభావాన్ని కోల్పోయాయి.

కాలం గడిచే కొలది ప్రతి విషయంలోనూ దేశభక్తి పూరిత భావాలు చోటు చేసుకున్నాయి. మోతీలాల్ నెహ్రూ విలాస జీవితాన్ని యింకే మాత్రం ఆపేక్షించలేదు. తన శక్తియుక్తుల నన్నింటినీ తన సునిశిత సంపత్తి నంతటిని ధారపోసిన న్యాయవాద వృత్తిని కొనసాగించడంలో ఇంకే మాత్రం అర్థంలేదని అనుకున్నారు.

మోతీలాల్ నెహ్రూ ఆనందభవన్‌లో తాను నిర్మించుకొన్న సౌభాగ్యవంత మైన చిన్న ప్రపంచాన్ని త్యజించేందుకు సాహసించాడు. జవహర్ లాల్ నెహ్రూ ఆమోదంతో ఈ "ఆనంద సదనాన్ని" స్వాతంత్ర్య సమరయోధులకు ఇచ్చి వేశాడు. ఈ భవనానికి "స్వరాజ్య భవన్" లేదా "స్వాతంత్ర్య సదనం"గా నామకరణం చేశారు.

ఆయన అతిథిసత్కారాలు, ముగ్ధమనోహరత్వాలు "ఆనందసదనానికి" ప్రజా నాయకులు, విజ్ఞాన నిధులు, న్యాయవాదులు మొదలగు వారిని ఆకర్షిం చాయి. వీరిలో భారతీయులు, అలాగే యూరోపియన్లు వున్నారు.

లండన్ తూర్పు ప్రాంత "దాతృమూర్తి"గా ప్రసిద్ధి కెక్కిన ఐరిష్ మహిళ అనిబిసెంటు నెహ్రూ కుటుంబానికి తరచుగా వచ్చే అతిథి. ఆమె సం స్కరణవాది - ప్రజాతంత్ర కార్యకలాపాలు ఇంగ్లండ్ ఎల్లెడలా సుపరిచితమే.

జవహర్‌లాల్ నెహ్రూ జీవన ప్రారంభ సంవత్సరాలు చాలా సంక్లి ష్టంగా వుండేవి. 20వ శతాబ్దం ద్వితీయ దశాబ్ద కాలంలో ఆయన క్రియా శీలమైన కార్యకర్తగా రూపొందాడు. ఇంగ్లండ్‌లోని సంపన్న వర్గాలు చదివే కాలేజీలో విద్యాభ్యాసం చేసిన నెహ్రూ బూర్జువా ఉదారవాద భావనలను ఆమోదించాడు. ఆయన తండ్రి, జాతీయ విమోచనోద్యమంలో ప్రసిద్ధ వ్యక్తి అయిన మోతీలాల్ నెహ్రూ కూడా యిదే భావనల్లో పాలు పంచుకున్నాడు. అయితే ఆయన యొక్క మేధోపూర్వక ఆసక్తి, నవ్య

తనై ఆయనకున్న అనురాగం కారణంగా జవహర్‌లాల్ నెహ్రూ సోషలిస్టు ఉద్యమంలో అభిమానాన్ని పెంచుకొన్నాడు.

1880 దశకం చివర భాగంలో, ఏదో ఒక రూపంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా వున్న దాదాపు ప్రతి సంస్థా అనిబిసెంటును తన నాయకుల్లో ఒకరుగా భావించింది. 1893లో భారతదేశానికి వచ్చిన వెంటనే అనిబిసెంటు "న్యూ ఇండియా" పత్రికను ప్రచురించడం ప్రారంభించింది.

ఆమె నెహ్రూ కుటుంబాన్ని సందర్శించడానికి వచ్చినపుడు దూరంగా వున్న ఇంగ్లాండ్ గురించి, భారతీయులను తమ సహోదరులుగా భావించే ఇంగ్లీషు వారి గురించి జవహర్‌లాల్ నెహ్రూకు చెప్పేది.

తన కుమారునకు యూరోపియన్ విద్య చెప్పించాలని మోతీలాల్ నెహ్రూ ఆదుర్దా పడేవాడు. ఈ అంశాన్ని పరిశీలించిన మీదట, అనిబిసెంటు సిఫార్సు మీదట ఇంటి వద్దనే తన కుమారునికి పాఠాలు చెప్పే ఒక యూరోపియన్ టీచర్‌ను నియోగించాడు.

జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిరోజూ తన టీచర్ ఫెర్డినాండ్ టి. బ్రూక్స్ దగ్గర చదువుకొనేవాడు. అధ్యయనాన్ని కొనసాగించేందుకు జవహర్‌లాల్ నెహ్రూ తండ్రి సేకరించిన మంచి సామాగ్రితో ఒక చిన్న ప్రయోగశాలను అమర్చారు. టీచరు, విద్యార్థి కలసి, పదార్థాల రహస్యాన్ని అధ్యయనంచేసేందుకు రసాయనిక ప్రయోగాలు నిర్వహించేవారు. టెలిస్కోప్ ద్వారా నిగూఢ నక్షత్ర ప్రపంచాన్ని చూసేందుకు వీలుగా చీకటి కోసం ఎంతో ఆతృతతో ఎదురు చూసేవారు.

అప్పటికే ఇంగ్లీషులో మంచి వాగ్ధాటివున్న జవహర్‌లాల్ నెహ్రూ ప్రపంచ సాహిత్యసంపదను దర్శించాడు. యువకుడైన జవహర్‌లాల్ నెహ్రూ పిన్న వయస్కుడైన అలివర్ ట్విస్ట్ విధి శరాఘాతాలను వైరాగ్యంతో అనుభవించిన లండన్ మురికివాడలను ఊహించుకోగలిగాడు; ఆయన బేకర్ స్ట్రీట్‌లో విహరించ గలిగాడు; ఇక్కడే నిరాడంబరుడైన డాక్టర్ వాట్సన్ అవిశ్రాంత అపరాధ పరిశోధకుడు (డిటెక్టివ్) షెర్‌లాక్ హోమ్స్ అంతర్ దృష్టిచేత ఆశ్చర్యచకితం చేయబడినాడు. అలాగే జవహర్‌లాల్ నెహ్రూ భయమంటూ ఎరుగని జూల్స్‌వర్నె నాయకులతో కలిసి అపారమైన, విశాలమైన సముద్రాలు, మహాసముద్రాలపై విహరించాడు. టామ్‌సాయర్, హకల్ బెర్రిఫిన్‌ల పెంకెతనపు లేదా తుంటరితనపు తాపులను చూసి గుండెనిండుగా నవ్వగలిగాడు జవహర్‌లాల్ నెహ్రూ. జెరోమ్ కె. జెరోమ్ యొక్క దురదృష్ట ప్రతిపాదకులను చూసి వ్యంగ్యంగా మాట్లాడాడు.

డాన్ క్విక్జోట్, అతని విధేయ అనుచరుడు శాంకో పాంజాలపట్ల సానుభూతి ప్రకటించాడు. సర్ వాల్టర్ స్కాట్ రూపకల్పన చేసిన సాహసులు మహో దారులు అయిన మధ్య యుగాలనాటి యోధుల గురించి, హెచ్. జి. వెల్స్ అద్భుత పాత్రల గురించి చదివి ఉద్వేగం పొందాడు. ది జంగిల్ బుక్‌లోని రుడ్యార్డ్ కిప్‌లింగ్ కథలు చదివి విశ్రాంతి పొందాడు. అందులోని శక్తిని, అందాన్ని, కల్పనా భాషయొక్క సున్నితాన్ని ఆనందించాడు.

ఇంగ్లండ్‌లోని ఒక ప్రతిష్టాత్మక విద్యా సంస్థలో ఉత్తమ విద్య చెప్పించాలని జవహర్‌లాల్ నెహ్రూ తండ్రి అనుకున్నాడు.

1905 లో, పెద్ద మొత్తం డబ్బు ఖర్చుచేసి మోతీలాల్ నెహ్రూ తన కుమారుణ్ణి హారోలో చేర్పించారు; ఇది ఒక బోర్డింగ్ స్కూలు; అన్ని సౌకర్యాలు యిందులోనే కలుగచేయబడినాయి; ఇంగ్లిషు జాతికి చెందిన సంపన్నవర్గాల పిల్లలకై దీనిని 1572 లో స్థాపించారు. లండన్‌కు పశ్చిమోత్తరంగా కొన్ని మైళ్ళ దూరంలో దీనిని ఏర్పాటు చేశారు. హారో స్కూలుతో పోల్చదగిన ఏకైక స్కూలు ఈటన్ వద్దగల యిలాంటి స్కూలు. వాటర్‌లూ యుద్ధం ప్రప్రథమంగా ఈటన్ స్కూలు మైదానంలో బ్రిటిష్ వారిచే గెలువబడిందని చెబుతారు; ఎందుకంటే దీనికి చెందిన విద్యార్థులే ప్రసిద్ధ సైనిక నాయకులయ్యారట; అలాగే హారో స్కూలు బ్రిటిష్ సామ్రాజ్యానికి తన ప్రధాన మంత్రులను — విలియమ్ పిట్, లార్డ్ పామర్గ్ స్టోన్ స్టాన్లీ బాల్డ్‌విన్, సర్ విన్‌స్టన్ చర్చిల్. జవహర్‌లాల్ నెహ్రూ కూడా స్వతంత్ర భారత ప్రథమ ప్రధాని అయ్యేందుకు హారో నుండే పట్టభద్రుడయ్యాడు.

జవహర్‌లాల్ నెహ్రూ త్వరగా యీ స్కూలు జీవితానికి అలవాటు పడ్డాడు. ఆయన చెస్ క్లబ్‌లో చేరాడు; ఫుట్‌బాల్ ఆడాడు; క్రాస్ కంట్రీ పందాల్లో పాల్గొన్నాడు; జిమ్నాస్టిక్స్, ఈక్వెస్ట్రియన్ పోటీల్లో పాలు పంచుకున్నాడు.

విద్యార్థిగా విజయాలు సాధించిన నెహ్రూకు తరచు బహుమతులు ఇచ్చేవారు. ఎక్కువగా గ్రంథాలు బహూకరించేవారు. ఉదాహరణకు ఆయనకు జార్జి ట్రెవెల్యాన్ గ్రంథాలలో ఒకటి యిచ్చారు. ఇది గారిబాల్డికి సంబంధించినది. ఇటలీ ప్రజానాయకుడు గారిబాల్డి కల్పనా చిత్రణ యిది. ఇది యువజనులపై బ్రహ్మాండమైన ప్రభావాన్ని కలుగచేసింది. అలాగే యిది అతనిపై చెరగని ముద్ర వేసింది. జీవితం అంతా శాశ్వతంగా నిలచిపోయింది. గారిబాల్డి గురించి బుక్ షాపులలో తాను కొనగలిగిన ప్రతి దానినీ, గ్రంథాలయంలో దొరికిన దానిని ఆయన చదివాడు. ఇటలీ ఏకీకరణ, ప్రజాతంత్ర రిపబ్లిక్

ఆవిర్భావ చరిత్ర, దానికున్న ప్రమాణాలు, చారిత్రక ప్రాధాన్యత, మహత్తర, ఉన్నత లక్ష్యాలు ఆయన్ను ఆకట్టుకున్నాయి; భారతదేశంలో జరుగుతున్న అలాంటి సంఘటనలను ఆయన ముందే వూహించాడు.

జవహర్‌లాల్ నెహ్రూ గ్రంథాలను విపరీతంగా చదివాడు; అయితే యికనుండి తన అధ్యయనాన్ని పద్ధతి ప్రకారం జరిపాడు. ఛార్లెస్ డికెన్స్, విలియం థాకరే, జార్జి ఇలియట్ ఆయన అభిమాన రచయితలు. వీరందరూ ఆంగ్ల సమాజ దగాను, కాపట్యాన్ని ఎండగట్టారు. ఇటలీ విముక్తి ఉద్యమం, బ్రిటిష్ పెత్తందారీ తనానికి వ్యతిరేకంగా అమెరికా వలసప్రాంత ప్రజలు జరిపిన యుద్ధం, ఫ్రెంచ్ విప్లవం, ఐర్లాండ్ స్వాతంత్ర్య పోరాటం గురించిన గ్రంథాలను ఆయన ఎంపిక చేసుకున్నాడు. భారత దేశభక్తుల లండన్ సంస్థ చాలా చిన్న ముద్రణలో ప్రచురించిన ఇండియన్ సోషియాలజిస్టు పత్రిక ఆయనకు చిక్కింది. ఈ పత్రిక ముద్రాపకుడు శ్యామ్‌జీ కృష్ణవర్మ; ఈయన బ్రిటిష్ సోషలిస్టుల సన్నిహితుడు; ఈయనకు అనిబిసెంటుతో సన్నిహిత, దీర్ఘ కాల పరిచయం వున్నది.

హారోలో వున్న రెండవ సంవత్సరంలో నెహ్రూ పాఠశాల గోడలమధ్య బిగించబడినట్లు భావించాడు. స్వేచ్ఛా వాయువులు పీల్చుకొనడానికి వీలుగా యూనివర్శిటీలో తన చదువును కొనసాగించాలని ఆయన నిర్ణయించాడు.

1907 లో, కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలో తన తరగతులు ప్రారంభించ డానికి ముందే జవహర్‌లాల్ నెహ్రూ ఐర్లాండ్ పర్యటనకు వెళ్ళాడు. ముందే నిర్ణయించుకొన్న పద్ధతిలో వెళ్ళిన యీ పర్యటన సందర్భంగా ఆయన అక్కడ పలు వారాలు గడిపాడు. ఆ దేశంలో జరుగుతున్నది స్వయంగా కళ్ళారా చూడాలని అనుకున్నాడు లండన్ నుండి వెలువడే వార్తా పత్రికలను ఆయన విశ్వసించలేదు. ఇంగ్లిషు పీడకులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఐర్లాండ్ ప్రజలపట్ల ఆయన తన హృదయపూర్వక సానుభూతిని తెలియ చేశారు ఈ పర్యటన జరగకుండా చూసేందుకు లేదా ఆయన్ను బెల్‌ఫాస్ట్‌కు పోనీయకుండా చేసేందుకు వీలుగా నెహ్రూతో మాట్లాడాలని అతని తండ్రి ప్రయత్నించాడు. బెల్‌ఫాస్ట్‌లో యిటీవలనే కార్మికులు (కల్లోలాన్ని సృష్టించే వారు అని ముద్ర వేయబడినవారు) పెద్ద ఎత్తున గంద్రగోళం కలిగించారు; సైనికులు వారిపై కాల్పులు జరిపారు. డబ్లిన్ నుండి తండ్రికి జవాబు చెప్పాడు జవహర్‌లాల్ నెహ్రూ. బ్రిటీష్ అధికారులకు వ్యతిరేకంగా జరిగే తిరుగు బాటును స్వయంగా చూడడానికే ఐర్లాండ్ వెళ్ళానని చెప్పారు.

యూనివర్సిటీ నుండి పట్టాను పొందిన తరువాత జవహర్‌లాల్ ఇన్నర్ టెంపుల్‌లో ప్రవేశించాడు. ఇది న్యాయవాదుల లండన్ అసోసియేషన్. జూరిస్ ప్రూడెన్స్ (ధర్మశాస్త్రం) లో ఆయన తేలికగా ఉత్తీర్ణుడయ్యాడు. 1912 వేసవిలో, బారిస్టర్‌గా స్వతంత్రంగా వృత్తిని కొనసాగించే హక్కును ఆయన పొందాడు.

ఇంగ్లండ్‌లో వున్న ఏడు సంవత్సరాల కాలంలో నెహ్రూ ఆ దేశంతో పరిచయం బాగా పెంచుకున్నాడు. అక్కడి జీవితాన్ని బాగా అలవరచుకున్నారు. ఇప్పుడు ఆయన స్వదేశాన్ని తిరిగి సందర్శించడానికి తిరిగి బయలుదేరారు.

తన తండ్రితో తన సంబంధం ఎలా వుండాలి? ఇంతకు ముందు రెండు సంవత్సరాల క్రితం ప్రచురింపబడిన ఒక వ్యాసంలో ఆయన తండ్రి, తన సహజ సిద్ధమైన ఖరాఖండి వైఖరితో, తాము పూర్తిగా స్వతంత్రులమన్న ఆలోచనతోవున్న బెంగాలీ తీవ్రవాదులపై దాడిచేశారు. అయితే బెంగాల్‌లోని తీవ్రవాద ఉద్యమంపట్ల జవహర్‌లాల్ నెహ్రూ సానుభూతితో వుండేది. ఈ వ్యాసంలోవున్న ఖండిత వైఖరి ఆయనకు నచ్చలేదు. ఆయన తన తండ్రికి ఒక లేఖ వ్రాశాడు; అందులో వ్యంగ్యం చోటు చేసుకొనకపోలేదు; మోతీలాల్ నెహ్రూ, సేన్ రాజకీయ అభిప్రాయాలు బ్రిటిష్ ప్రభుత్వానికి సంతోషాన్ని కలుగచేస్తాయని జవహర్‌లాల్ నెహ్రూ పేర్కొన్నారు.

చిటపటలాడే మోతీలాల్‌ను రెచ్చగొట్టిన తన కుమారుని నిర్ధారణలపై ఆయనకు కలిగిన అభిప్రాయాలను ఎవరైనా వూహించుకోగలం. తర్వాత తెలిసింది జవహర్‌లాల్ నెహ్రూకు, ఆగ్రహావేశాల్లో తన కుమారుని తిరిగి భారతదేశానికి పిలిపిస్తానని మోతీలాల్ నెహ్రూ బెదిరించిన విషయం. అయితే అంతకుముందు జరిగినట్లుగానే మోతీలాల్ వెంటనే చల్లబడ్డాడు. తన కుమారుని సందేశం అలోచనారహితమైనదనీ, బాల్య చాపల్యమనీ భావించాడు. తిరిగి స్వదేశానికి పిలిపించాలన్న తన ఆలోచనను మార్చుకున్నాడు మోతీలాల్. ఆయన కుమారుడు తన చదువులను ముగించుకొని విద్యావంతుడుగా తిరిగి భారతదేశం వచ్చాడు. న్యాయవాద వృత్తిలో తండ్రికి మించిన తనయుడయ్యేందుకు వచ్చాడు.

1912 నవంబరులో జవహర్‌లాల్ నెహ్రూ తనతండ్రి లీగల్ ఆఫీసులో పనిచేయడం ప్రారంభించాడు. అక్కడ తన పని రోజురోజుకూ పెరుగుతున్న భారంగా త్వరలోనే గ్రహించాడు. తాను అర్థరహితమైన, నిష్ఫలమైన హుషారులేని దైనందిన జీవితంలోనికి ఈడ్వబడుతున్నానని యువకుడైన నెహ్రూ గ్రహించాడు.

తన పీడితదేశ భవితవ్యాన్ని రూపుదిద్దడంలో పాల్గొనాలని ఉవ్విళ్ళూరు తున్న జవహర్‌లాల్ నెహ్రూ అదే సంవత్సరం డిసెంబరు మాసంలో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (ఐ. యన్. సి.) బంకీపూర్ సమావేశానికి హాజ రయ్యాడు. 1885 లో భారత జాతీయ బూర్జువావర్గం సంస్థాపించిన ప్రథమ అఖిల భారత రాజకీయ పార్టీ యిదే. అయన నిరుత్సాహపడ్డాడు. ఆయన అభి ప్రాయంలో కాంగ్రెస్ పార్టీ సంపన్నులకు ప్రాతినిధ్యం వహించే పార్టీ; దీనికి నిజమైన స్వాతంత్ర్య సాధనకు దేశాన్ని నడిపించే శక్తిలేని పార్టీ.

జవహర్‌లాల్ నెహ్రూ రాజకీయ అభిప్రాయాలు యింకా అస్పష్టంగా వున్నాయి. 1912 లో కాంగ్రెస్‌లో చేరి ఆయన దాని కార్యకలాపాల్లో క్రియా శీలంగా పాల్గొనలేకపోయాడు. ఆయన సానుభూతి అంతా తీవ్రవాదులతోనే వున్నది; తీవ్రవాదులలో ఎక్కువమంది హింసను ప్రబోధించినప్పటికీ ఆయనకు వారిపట్లే సానుభూతి వుంది.

"మనం ప్రస్తుతం వున్న పరిస్థితులను కొనసాగనివ్వరాదు. మనం, పరాయి పాలకులపట్ల మరింత తీవ్రమైన మరింత క్రియాశీలమైన వైఖరులను తీసుకోవాలి" అని ఆయన భావించాడు. అయితే పరిస్థితులు ఎలావుంటాయి? ఆధారపడడానికి ఎవరున్నారు? సవాలక్ష ప్రశ్నలు. అందువల్ల యింతవరకు జవహర్‌లాల్ నెహ్రూకు యీ ప్రశ్నలకు సమాధానాలు చిక్కలేదు.

అంతర్జాతీయ పరిస్థితి ఉద్రిక్తంగావున్న దృష్ట్యా ప్రపంచ పరిణామాలపై ఒక కన్ను వేసివుంచాడు.

సర్‌జేవాలో (మధ్య యుగొస్లావియా) 19 సంవత్సరాల సెర్చ్ గవ్రిలో ప్రిన్‌సిప్ పేల్చిన తూటాలు యూరోప్‌ను కుదిపివేశాయి. 1914 ఆగస్టులో యూరోప్, తమ స్వంత ప్రయోజనాలకై ప్రపంచ చిత్రపటాన్ని తిరిగి వ్రాయాలన్న పెద్ద సామ్రాజ్యవాద దేశాలమధ్య భయానకమైన సంఘర్షణా రంగంగా రూపొందింది.

మొదటి ప్రపంచయుద్ధం భారతదేశానికి చాలా దూరంగా జరిగింది. భారత ప్రజలకు సంబంధించి యీ యుద్ధం అర్థంకానిది, అన్యమైనది.

అయితే బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగా వున్నదికాబట్టి భారతదేశం ("బ్రిటన్ చదరంగంపై రాణి") రక్తపుటేరులు ప్రవహించిన ప్రపంచ యుద్ధాల్లో ఒకటైన యీ యుద్ధంలోనికి యీడ్వబడింది.

ఈ యుద్ధం హేయమైనది, అసహ్యకరమైనదన్న భావన జవహర్ లాల్ నెహ్రూకు కలిగింది. అందువల్లనే బ్రిటన్‌నుగానీ, లేదా జర్మనీనిగానీ బలపరచలేదు. ఆయన పరిచయస్థులలో కొందరు జర్మనీని బలపరచారు;



ఇంగ్లండులో జవహర్‌లాల్ నెహ్రూ (1907)



తండ్రి మోతీలాల్ నెహ్రూతో జవహర్‌లాల్ నెహ్రూ

కైజర్ ప్రభుత్వానికి సానుభూతి తెలియచేయడం మాట అటుంచితే బ్రిటిష్ పీడకులు అపజయంపాలుగావాలన్న ఉద్దేశ్యంతో వారు జర్మనీని బలపరిచారు.

అనేకమంది కాంగ్రెస్ నాయకులు, బ్రిటిష్ పాలకులకు విధేయత ప్రకటిస్తే తగు ప్రతిఫలం లేదా బహుమతి లభించగలదన్న ఆశతో, యుద్ధంలో బ్రిటన్‌ను బలపరచాలని పిలుపు యిచ్చారు. ప్రజాస్వామ్యం పదిలంగా వుండాలని వాదించారు. యుద్ధానంతరం బ్రిటన్, భారతదేశంపట్ల తన వైఖరిని సమీక్షించుకొంటున్నదన్న వారి ప్రకటన, బ్రిటిష్ సామ్రాజ్య చట్రంలో స్వయంపాలనను మంజూరు చేస్తారని కాంగ్రెస్ వాదులు విశ్వసించారు. ఇది యిలా వుండగా పోలీసు దమనకాండ, భయానకమైన సెన్సార్ షిప్ అమలు చేసారు; భారత రక్షణకు సంబంధించిన 1915 సంవత్సరపు పాశవిక చట్టం ప్రత్యేక ట్రిబునళ్ళను సృష్టించింది; వీటి దండనలకు తిరుగు లేదు, వీటిపై అపీలు చేసుకొనడానికి అవకాశంలేదు.

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ 31 వ సమావేశం 1916 డిసెంబరులో లక్నోలో జరిగింది. బ్రిటిష్ సామ్రాజ్యంలోని స్వయంపాలనా ప్రాంతాలతో సమానంగా భారతదేశానికి స్వయంపాలనను యివ్వాలని యీ మహాసభ డిమాండ్ చేసింది.

లక్నోలో జవహర్‌లాల్ నెహ్రూ, మోహన్‌దాస్ కరంచంద్ గాంధీని పరిచయం చేసుకొన్నాడు. ఆయన దక్షిణాఫ్రికాలో 20 సంవత్సరాలు నివసించి భారతదేశానికి తిరిగి వచ్చారు.

నెహ్రూ, గాంధీలు........భారత ప్రజలు వారిని — నెహ్రూను "భారత్ భూషణ్" ("భారతదేశం ఆణిముత్యం") గాంధీని "మహాత్మ" (గొప్ప ఆత్మ కలవాడు) "బాపు" ("జాతిపిత") అని పిలిచారు.

1916 లో జవహర్‌లాల్ నెహ్రూ కమలా కౌల్‌ను వివాహమాడారు. ఆమె కాశ్మీరు బ్రాహ్మణుని కుమార్తె. ఆమె నెహ్రూ సతీమణి కావడమే గాకుండా అనురాగమూ, విధేయతగల అర్ధాంగి అయింది. ఆమె నెహ్రూను బలపరిచేది. బలాన్ని చేకూర్చేది. సహాయం అవసరం అయినప్పుడు ఆమె నుండి నెహ్రూ సహాయాన్ని పొందేవాడు.

అదే సంవత్సరంలో జవహర్‌లాల్ నెహ్రూ భారత జాతీయ విముక్తి ఉద్యమంలో క్రియాశీలకమైన పాత్ర వహించడం ప్రారంభించాడు. జాతీయ స్వేచ్ఛ, రాజకీయ స్వాతంత్ర్యం కోసం జరిగే పోరాటంలో ఆయన వృత్తిపరమైన విప్లవవాదిగా తయారు అయ్యాడు. భారత ప్రజల వలస వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమ నిర్మాణదక్షులు, నాయకులలో ఒకరుగా

తయారయ్యారు. భారత ప్రజలు తమ నేతగా ఎంచుకొన్న మహాత్మాగాంధీ 1919 లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ నాయకత్వం తీసుకొన్నప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ, గాంధీ తోడ్పాటుదారులలో ఒకడు, అతని అస్సన్నిహిత సహచరులలో ఒకడు అయ్యాడు. దీని తరువాత నెహ్రూ కాంగ్రెస్ పార్టీ నాయకత్వ స్థానాలకు ఎన్నికయ్యారు. అనేకసార్లు దానియొక్క ఉన్నత పదవులను అలంకరించారు: అనగా పార్టీ అధ్యక్ష స్థానానికి ఎన్నికయ్యారు. ఆ సంవత్సరాల్లో కాంగ్రెస్ భారతదేశం యొక్క మంచి పలుకుబడి కలిగిన రాజకీయ సంస్థగా వుండింది.

జవహర్‌లాల్ నెహ్రూ జీవన సరళి అలా ప్రారంభం అయింది. చారిత్రక పరిస్థితులు ఆదేశించినందువల్ల, తన స్వంత నిర్ణయం దృష్ట్యా, అలాగే అతని దేశభక్తియుతభావాల ప్రేరణతో నెహ్రూ యిలా రూపొందాడు. భారతదేశం విముక్తి అయ్యేంతవరకు ఆయన జైలు శిక్షలు అనుభవించాడు; కరగండ్లపాలైనాడు; రాజకీయ పోరాటాలు సల్పాడు; ఓటమి చేదును, గెలుపు తీపిని చవిచూశాడు.

# భారత స్వాతంత్ర్యం యొక్క రెండు మూల స్తంభాలు

భారత దేశ సుదీర్ఘ స్వాతంత్ర్య పోరాటం అనేక మంది ప్రసిద్ధ రాజకీయ నాయకులను, జాతీయ స్వాతంత్ర్య యోధులను, భారత విప్లవ మహా కవులను తయారు చేసింది. అయినప్పటికి ప్రపంచం యిద్దరు మహా వ్యక్తులను అనగా మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, జవహర్‌లాల్ నెహ్రూలను నవభారత మూల స్తంభాలుగా, సంస్థాపకులుగా పరిగణిస్తుంది. మొదటి వ్యక్తి స్వాతంత్ర్యోద్యమ ఆత్మిక నాయకుడు. రెండవ వ్యక్తి దాని యొక్క మహోన్నత రాజకీయ నాయకుడు; ప్రజాతంత్ర లౌకిక, శాంతి కాముక దేశమైన భారత రిపబ్లిక్ ప్రథమ ప్రధానమంత్రి

భుజం భుజం కలిపి పోరాడుతూ, ప్రపంచం పట్ల తమకున్న స్వంత పరస్పరాన్ని శక్తివంతమూ, సంపద్వంతమూ చేసుకుంటూ గాంధీ, నెహ్రూలు, అన్ని పరీక్షలు నెదుర్కొంటూ, అహింసాయుత పోరాటంలో వీరోచితమైన ఆత్మ త్యాగాలు చేసుకుంటూ భారత విముక్తి విప్లవ జాజ్వల్యమైన పతాకాన్ని ముందుకు తీసుకువెళ్ళారు. జాతీయ నాయకులుగా రూపొంది, ప్రజా సహకారం పొందుతూ వారు, ప్రపంచ నాగరికతకు పుట్టిగడ్డగ నిలిచిన భారత ప్రజల అలాగే, మానవ విలువలు అనే సంపదకు ఎవరి దోహదం తక్కువ అంచనా వేయడానికి వీలులేదో అలాంటి భారత ప్రజల ఆత్మ ప్రబోధాన్ని లేదా మన స్వాక్షిని, సాంప్రదాయిక ఆత్మకథను నిర్లక్ష్యం చేయలేదు.

20వ శతాబ్దం ప్రథమ అర్థభాగంలోని భారత చరిత్ర ఈ రెండు పేర్లు లేకుండా వూహించడానికి వీలు లేనటువంటిది. పైగా ఒకరి నుండి ఒకరిని వేరుచేసి వ్రాయడం అన్నది ఆ కాలంలోని వాస్తవాలను వక్రీకరించడం అవుతుంది; దేశం యొక్క యిటీవలి చరిత్రను సమగ్రంగా అర్థం చేసుకొనలేక పోవడమే అవుతుంది.

వారి సాంఘిక ప్రతిపత్తి, వయస్సు ఆలోచనా విధానం, వ్యక్తిత్వాలకు సంబంధించి జవహర్‌లాల్ నెహ్రూ, మహాత్మా గాంధీలు పూర్తిగా విభిన్నమైన వ్యక్తులు. ఈ ఇద్దరు వ్యక్తుల్లో ప్రతి ఒక్కరికి తన స్వంత ప్రాపంచిక దృక్పధం ఉన్నప్పటికీ, ఇద్దరినీ కలిపి అధ్యయనం చేయడం ద్వారా మాత్రమే ఆ సమయంలోని దేశ ఆత్మిక, రాజకీయస్థితి నిజచిత్రణను మనం చూడగలం.

నెహ్రూఆదర్శం వైవిధ్యంతో కూడినది; సంపూర్ణ జీవనం కలిగినది. గాంధీ ఒక సన్యాసి. మొదటివ్యక్తి నిరీశ్వరవాది. రెండవ వ్యక్తి పూర్తిగా మత విశ్వాసం వున్న మనిషి. ఆయన ఈ సంస్కృతి నుండి ఎన్నడూ తనను తాను వేరుచేసుకొనలేదు. గాంధీ ధృడంగా భారతీయ సంప్రదాయాలకు కట్టుబడి వున్నాడు, పరాయిధోరణులకి వ్యతిరేకంగా వాటిని కాపాడుతుండేవాడు నెహ్రూ. ఆయనే అంగీకరించినట్టుగా రైతుల అతి నికృష్టజీవితాన్ని ఇష్టపడే వాడు కాదు; వారిని దారిద్ర్యాన్నుండి బయట పడేయాలనుకున్నాడు; గాంధీకి రైతాంగ మనస్తత్వం వుంది; పితృస్వామిక గ్రామీణ జీవితాన్ని ప్రచారం చేసేవాడు; నెహ్రూ సాంకేతిక ప్రగతిని కోరుకున్నాడు; పారిశ్రామిక భారత దేశాన్ని వూహించాడు; గాంధీ, ఆధునిక సాంకేతిక శాస్త్రాన్ని నాగరికతకు విపత్తుగా పరిగణించాడు; గతానికి లొంగి పోవాలని కలలు కన్నాడు; నెహ్రూ హేతువాది; గాంధీ మాయా వాదానికి మరింత దగ్గరగా వుండేవాడు.

నెహ్రూ, తన స్వంత అభిప్రాయాలను సర్వదా కొనసాగిస్తూనే, తన జీవితం పొడవునా బ్రహ్మాండంగా గాంధీ ప్రభావానికి గురి అయ్యాడు. గాంధి తాత్వికత కంటే ఆయన వ్యక్తిత్వం కారణంగా ఇలా జరిగేది. "గాంధీ జీవితంలో అద్భుతమైన వ్యక్తి. ప్రజలపై ఆయనకు ఆశ్చర్యకరమైన, తిరుగు లేని సమ్మోహనాశక్తి, స్పష్టమైన అధికారం వుండేవి" అని ఆనందంతో నెహ్రూ అన్నారు. "ఆయన రచనలు, బోధనలు, వెనకవున్న ఆ వ్యక్తి ప్రభావాన్ని లేదా ముద్రను ఏమాత్రం తెలియచేయవు. ఆయన వ్యక్తిత్వం, ఆయనను గురించి మనం అనుకున్న వాటి కంటే చాలా బృహత్తరమైనది" అని నెహ్రూ స్పష్టం చేశారు.1 "భారతదేశంలో ఇది గాంధీ శకం" అని దేశచరిత్రలోని గాంధీ పాత్రకు సంబంధించి నెహ్రూ అన్నారు.2

నెహ్రూకు దక్కిన ఖ్యాతి యేమంటే గాంధీ "నిగూఢ" వ్యక్తిత్వాన్ని తానుగా మొదట అధ్యయనం చేసింది, దాని సారాన్ని అర్ధం చేసుకున్నదీ,

1. జవహర్‌లాల్ నెహ్రూ, ఆత్మకథ, దిబోడ్లీ హెడ్ లండన్,1958 పుట 508.
2. జవహర్‌లాల్ నెహ్రూ, ప్రపంచ దర్శనం (గ్లిమ్‌సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ) లిండ్సే డ్రుమండ్ లిమిటెడ్, లండన్, డబ్లు. సి. 1939 పు. 689.

ఆలాగే ఆయన విపరీతంగా కనబడు భావాలను గ్రహించి, ఆ ప్రజానాయకుని గురించి పశ్చిమ దేశాల ప్రజలకు తెలియ చెప్పింది ఆయనే. దానికి బదులుగా గాంధీ, బరోపాలో నివసించి, విద్యాభ్యాసం చేసివచ్చిన తన దేశస్థుడు నెహ్రూ గురించి సాధారణ భారత ప్రజలకుతెలియచేశారు.

గాంధీ మనోజ్ఞానచర్యలు తార్కికవిశ్లేషణలకు వ్యతిరేకంగా వున్నాయని నెహ్రూ పదేపదే అంగీకరించారు. అత్యంత సంక్లిష్ట రాజకీయ పరిస్థితుల్లో సరైన విధంగా, సవ్యంగా పనిచేసే అసాధారణ ప్రజ్ఞ గాంధీకి వున్నదని ఆయన చెప్పాడు. "పాపం తర్కం, మేధో సంపత్తి, హేతువాదం ఆయన ముందు యేమి చేయగలవు." అని నెహ్రూ అన్నారు.1 గాంధీజీ ఒక అద్భుతశక్తి: యావత్తు భారత జీవన విధానం, ఆదేశపు నిర్దిష్ట అంశాలు, సమస్యలు, పరిష్కరించడానికి వీలులేనివిగా స్పష్టంగా కనబడే సమస్యల సమాచారము, ఈ సమస్యల కబంధహస్తాల నుండి స్వేచ్ఛను పొందాలన్న ధృడమైన తిరుగులేని ఆకాంక్ష—ఇవన్నీ ప్రాదుర్భవింప చేసిన అరుదైన మానవుడే గాంధీ అని నెహ్రూ గుర్తించాడు. గాంధీ సహజ స్వభావం, లక్షణాలు, తన ప్రజల ఎడవున్న ఆత్మిక సాన్నిహిత్యము అతీంద్రియ శక్తిని, నిర్భీకతను కలుగచేశాయి.

"బహుశ ఏ ఇతర దేశంలోనూ ఈ రోజున ఆయనకు స్థానం ఉండక పోవచ్చు. అయితే భారతదేశం, పాపం గురించి, మోక్షం, అహింస గురించి మాట్లాడే మత ప్రవక్త — మత నాయకుడు లాంటి వ్యక్తి అయిన గాంధీని అర్థం చేసుకుంటున్నట్లు లేదా శ్లాఘిస్తున్నట్టు కనబడుతున్నది" అని నెహ్రూ, గాంధీ గురించి వ్రాశారు; 2

గాంధీకున్న యోగ్యతలు, లక్షణాలు అన్నింటిలోనూ, విప్లవాయుత పద్ధతిలో పనిచేసే శక్తి మహత్తరమైనదని నెహ్రూ విశ్వసించారు. గాంధీ మనోస్థయిర్యాన్ని, స్వార్థరాహిత్యాన్ని, భారత విమోచన పోరాటంలో విజయంపట్ల అచంచలమైన విశ్వాసాలను ఆయన శ్లాఘించారు.

విమోచనోద్యమంలో ప్రజాబాహుళ్యాన్ని సంఘటిత పరచగల గాంధీ విశిష్ట శక్తిని నెహ్రూ విశ్వసించారు. అందువల్లనే ఆయనఅభిప్రాయాల్లో పాలు పంచుకోకుండానే ఆయన్ను అనుసరించాడు. దేశాన్ని దాని అంతిమ లక్ష్యం

---

1. జవహర్‌లాల్ నెహ్రూ సంకలిత రచనలు, 1972 - 1976, సంపుటి 5, ఓరియంట్ లాంగ్‌మన్, న్యూఢిల్లీ 1973 పు. 408.

2. జవహర్‌లాల్ నెహ్రూ. ఆత్మకథ పుట 253.

వైపు తీసుకువెళ్ళేందుకు అవసరమైన అన్ని లక్షణాలున్న ఒక మహానేతను ఆయనలో చూశారు.

అయితే ఇక్కడొక విషయాన్ని గమనించాలి; నెహ్రూ, గాంధీల మధ్య తీవ్రమైన సైద్ధాంతిక విభేదాలున్నాయి. ఉద్యమ ఐక్యత కోసం నెహ్రూ ఎన్నో సార్లు గాంధీ చెప్పిన అంశాలను ఆమోదించాడు. 1927 - 1928 లో ఆయన అలా చేశాడు; త్వరపడి ముందుకురికి నందుకుఅలాగే, అంతరంగిక శక్తులపై ఆధారపడడానికి బదులుగా పశ్చిమ దేశాల్లోని సామ్రాజ్య వాద శక్తులనుండి విదేశీసాయాన్ని కోరే ప్రమాదకర చర్యనుతీసుకున్నప్పుడు గాంధీ ఆయన్ను నిందించిన సందర్భం యిది. అలాగే 1930 లో, భారతదేశంలో శాస్త్రీయ సోషలిజం పద్ధతులను అనువర్తింప చేయడానికి ఆయన ప్రయత్నించినపుడు కూడా నెహ్రూ, గాంధీ మాటలను బొదలదాల్చాడు.

ఈ యిద్దరు వ్యక్తులు తమను వ్యతిరేకులుగా, రాజకీయ ప్రత్యర్థులుగా భావించుకొనలేదు. " నాపట్ల, వ్యక్తిగతంగా గాంధీజీ సర్వదా అసాధారణమైన దయను చూపించారు. నేను చెప్పేదానిని బాగా ఆలోచించేవారు" అని నెహ్రూ వ్రాశాడు.

ఆయన ఇంకా ఇలా వ్రాశాడు : "నేను ఏమి చెప్పినా వినేవాడు. నా ఆకాంక్షలను తీర్చడానికి అన్ని ప్రయత్నాలు చేశారు. ఇది కొందరు నా సహచరులు, నేను కలసి ఆయన్ను సోషలిస్టు అభిముఖంగా నడిపించగలమని అనుకునేట్టు చేసింది. అలా చేసేందుకు వీలుగా మార్గం కనపడినకొలది అడుగులో అడుగువేసుకుంటూ ముందుకు పోవడానికి తాను సిద్ధంగా వున్నానని స్వయంగా ఆయనే చెప్పారు."1

అయితే మూడు దశాబ్దాలపాటు సాగిన వారి అసమాన శక్తివంతమైన రాజకీయ సహకారానికి కారణభూతమైంది ఒక్క వ్యక్తిగత సాన్నిహిత్యం, మహత్తర మైత్రి మాత్రమే కాదు. వారికి పరస్పరం వాస్తవమైన అవసరం కూడా వున్నది: ఈ యువ, చలనశీల వున్నత విద్యావంతుడైన నవనాయకుని తోడ్పాటు లేకుండా గాంధీ యేమీ చేయగలిగి వుండేవారుకాదు; సాంప్రదాయకమైన భారత రీతిలో ఆలోచించి, స్వాతంత్ర్య ఆశయాలకు అకుంఠితంగా అంకితమైన ప్రజాదరణ కలిగిన, వివేకి అయిన ఉపాధ్యాయుని అవసరం నెహ్రూకు వున్నది.

వారు కొన్ని సందర్భాల్లో ఎత్తుగడలపై విభేదించినప్పటికి నెహ్రూ, గాంధీ ఉభయులూ, భారతదేశ విముక్తి అన్న ఏకైక వ్యూహాత్మక లక్ష్యం

1. జవహర్‌లాల్ నెహ్రూ ఆత్మకథ పు - 255.

వారిని ముందుకు నడిపించింది. విధాన వివరణలపై పూర్తి ఏకీభావం లేక పోయినప్పటికీ, ప్రజలపై ఆధారపడడం విశ్వాసంతో వారి ప్రయోజనాలకై కృషి చేయడం అన్న దానియొక్క ప్రధాన సారాంశాన్ని వారు సర్వదా అంగీకరించారు. నెహ్రూ, గాంధీల మధ్య పొరపొచ్చాలు గుర్తు అన్నది లేకుండా అదృశ్యం అయినాయి; వారి ఐక్యత విజయపథాన నడిపించింది.

# జైల్లను ధిక్కరించిన మేధావి

వలసవాద అధికారులు, జవహర్‌లాల్ నెహ్రూను తమ ప్రముఖ ప్రత్యర్థిగా పరిగణిస్తూ ఆయన్ను, ఆయన కుటుంబ సభ్యులను, ఆయన సన్నిహిత సహచరులను వేధించి, కేసులు బనాయించారు.

1921 - 1944 సంవత్సరాల మధ్య ఆయన మొత్తంగా పది సంవత్సరాల పైన జైలులో వున్నాడు. అయినప్పటికీ, వలసవాద బానిసత్వాన్నుండి భారతదేశాన్ని విముక్తి చేయాలన్న ఆయన లక్ష్యంలోని పవిత్రతపట్లగల అభేదీ విశ్వాసాన్ని అధికారులు సడలింపలేకపోయారు.

జైలులో నెహ్రూ, తన ప్రజల చారిత్రక భవితవ్యం గురించి మహత్తరమైన భావనలు సంపూర్ణంగా వున్న గ్రంథాలను వ్రాయడం కొనసాగించాడు. భారతదేశంలో బ్రిటిష్ పాలనపై తీవ్ర విమర్శలు వాటిలో వున్నాయి; సామ్రాజ్యవాద యుద్ధాలను, తూర్పు దేశాలకు వ్యతిరేకంగా సాగుతున్న సామాజిక హింసను అవి ఎండగట్టాయి.

అపారమైన విజ్ఞానం, వైవిధ్యపూరిత బౌద్ధిక ప్రయోజనాలుగల భావుకుడుగా నెహ్రూ గ్రంథాలు చాటిచెబుతాయి: అవి రాజకీయ విశ్లేషణతో చేయడమేగాకుండా, ఆర్థికశాస్త్రం, సాహిత్యం, కళలు, నైతిక సూత్రాలు, సౌందర్యశాస్త్రం, పురాణాలు, మతం, సామాజికశాస్త్రం, తత్వశాస్త్రాలను వివరిస్తాయి. సహజ ప్రతిభావ్యుత్పత్తులుగల, పరిణతిపొందిన అకుంఠిత కృషి ఫలితమే ఆయన వెలువరించిన గ్రంథాలు; అలాగే అతని పరిశోధనలు, పరిశీలనలు, నిర్ధారణల ఫలితమే ఆయన వ్రాసిన గ్రంథాలు. ఆయన దృగ్విషయం, సంఘటనల సారాంశంలోనికి చొచ్చుకపోతాడు; వాటియొక్క గోచరమైన, బాహ్యంగావున్న అలాగే అంతర్గతంగావున్న, అంతర్ సంబంధాలను పరిశోధిస్తాడు; వారి అభివృద్ధియొక్క వస్తుగత నియమాలను బయటకు తీస్తాడు. నెహ్రూ యొక్క శాస్త్రీయ పద్ధతి వేరుచేసి చూడడంకాదు; శక్తివంత

మైన రాజకీయ సాధనం; జాతీయ విముక్తి ఉద్యమంలోని ఘర్షణలు, కష్టాలను సవ్యంగా పరిష్కరించడానికి వస్తుగతమైన ప్రాతిపదిక.

ఉదాహరణకు, తాను భారతీయుణ్ణి అయిన కారణంగా భారతదేశంలోని బ్రిటిష్ వలసవాదుల పాలనను నిష్పాక్షికంగా అంచనా వేయగలగలేననీ, పక్షపాతం లేకుండా దీనినిగానీ లేక ఇలాంటి యితర రాజకీయ సమస్యలను గానీ పరిష్కరించలేనని నెహ్రూ అంగీకరించాడు. ఒకవైపు మాత్రమే రుజువు చేయాలనుకొనే ఒక జాతీయ వాదిగా కాక "వాస్తవాలను నిష్పాక్షికంగా పరిశీలించే ఒక శాస్త్రజ్ఞుడుగా యీ ప్రశ్నలను పరిశీలించాలి. జాతీయ వాదం మనల్ని అనేక సంఘటనలను చూడనీయకుండా కళ్ళకు గంతలుగట్టి గుడ్డివాళ్ళుగా చేస్తుంది, కొన్ని సందర్భాల్లో, ముఖ్యంగా, మనమూ, మన దేశానికి సంబంధించినప్పుడు సత్యాన్ని వక్రీకరిస్తుంది" అని తాను భావించవలసి వుంటుంది అని ఆయన ముగించారు.[1]

దేశభక్తుడుగా, ఉద్వేగపూరిత వ్యక్తిగా, యీ నిష్పాక్షికతకు కట్టుబడి వుండడం అన్నది అంత సులభమైనది కాదని ఆయన తెలుసుకున్నాడు. అయితే అతని హేతువాద ఆలోచన ఎల్లప్పుడూ అతని మనోభావాలపై పైచేయి సాధించింది. ఎందుకంటే పరిస్థితిని సక్రమంగా అర్థం చేసుకొనడం ఒక్కటే అనగా సత్యాన్ని అవగతం చేసుకొనడం, రాజకీయాల్లో విజయాలకు దారితీస్తుందని ఆయనకు తెలుసు.

నెహ్రూ అభిప్రాయంలో రాజకీయాల ప్రధాన ప్రయోజనం, లక్ష్యం సామాజిక జీవితంలో వున్న ప్రస్తుత పరిస్థితిగతులను మార్చి, మెరుగు పరచడం. ఈ పరిస్థితులను అతిస్పష్టంగా, నిష్పాక్షికంగా, వాస్తవంగా దర్శించడానికి విమర్శనాత్మక అంచనా తప్పనిసరిగా అవసరం అవుతుంది; మానసిక ప్రయత్నం ద్వారా మాత్రమే యిది సాధ్యం.

"మనం మరింతగా ఆలోచించేకొలదీ, అప్పుడున్న పరిస్థితులను పరిశీలించి, వాటిని విమర్శించడం ప్రారంభిస్తాము. ఇది తరచు, ప్రస్తుతంవున్న వ్యవస్థను సవాల్ చేసేందుకు దారి తీస్తుంది. అజ్ఞానం ఎప్పుడూ మార్పును చూసి భయపడుతుంది. అది అజ్ఞాతంగా వున్న, మనం తెలుసుకోవాల్సిన దానిని చూసి భీతి చెందుతుంది; అది ఎంత దుర్భరమైనదైనా ఆ పాతగాడి లోనే తిరుగుతూ వుంటుంది" అని ఆయన వ్రాశాడు.[2]

1. జవహర్‌లాల్ నెహ్రూ, ప్రపంచ దర్శనం పుట - 443.

2. జవహర్‌లాల్ నెహ్రూ, ప్రపంచ దర్శనం, పుట - 276.

నెహ్రూ రాజకీయ ఆలోచనలో నిరంతర క్రియాశీలత వుంది. విశ్వాంత రాళం, సమాజం, మానవుడు, భావనలు తిరుగులేని, నిరంతర అభివృద్ధి క్రమంలో వున్నాయన్నది ఆయన విశ్వాసం. తమ భావనలను సంపద్వంతం చేసుకొనడానికి లేదా మార్చుకొనడానికి కొందరు రాజకీయవాదులు యిష్టపడక పోవడం వివేకవంతమైన చర్యకాదని ఆయన స్పష్టీకరించారు. తన అభిప్రాయంలో, యిలా ఇష్టపడక పోవడంఅన్నది మితవాద, సంకుచిత మన స్తత్వం, నిరంతర మార్పు చెందుతున్న పరిస్థితులను అనుసరించి అనుకరించక పోవడాలకు సంకేతం. నెహ్రూకు సంబంధించి, ఆయనకు పెద్దవయస్సు వచ్చేదాకా, నూతన అంశాలను చూసేందుకు ప్రయత్నం చేశాడు; కాలానికి, నిరంతరం జరుగుతున్న ఘటనలకు వెనుకబడి వుండకుండా వుండేందుకు ప్రయత్నం చేశాడు.

ఆలోచన నిరంతర చలనశీలమైనదన్న నెహ్రూ విశ్వాసం, కాలంచెల్లిన నిర్ధారణలను, అంచనాలను సవరించాలన్న ఆయన అభిమతం, ఆయన రాజకీయ ఆచరణ, పట్టువిడుపులతోకూడిన వైఖరులు యేవిధంగానూ, అతని ప్రపంచ దృక్పథంలో ప్రాథమిక విలువలు, సూత్రాలు, అనివార్య లక్ష్యాలు లుప్తమైనాయని స్పష్టీకరించవు. తద్విరుద్ధంగా, యీ సూత్రాల, లక్ష్యాల అంతిమ విజయం సాధించేందుకు తన యావత్తు జీవితాన్ని అంకితం చేశాడు. సరిగ్గా, జాతీయ విముక్తి ఉద్యమ మౌలిక, వ్యూహాత్మక కర్తవ్యాలకు ఆయన యిచ్చిన పరిష్కారాలు నెహ్రూ యొక్క సైద్ధాంతిక అభిప్రాయాలు, విధానాల నిలకడకు ఉత్తమ అభివ్యక్తీకరణలు.

1930-1933 సంవత్సరాల్లో జైలులో వుంటూ, నిర్బంధ విశ్రాంతిని, ఒంటరితనాన్ని అనుభవిస్తున్న కాలంలో (నెహ్రూయే యీ మాట వ్యంగ్యంగా అన్నాడు) నెహ్రూ ప్రపంచ చరిత్రపై సమగ్రమైన గ్రంథం వ్రాశాడు. తన కుమార్తె ఇందిరకు అద్భుతమైన లేఖల రూపంలో వ్రాసిన యీ గ్రంథం ఖచ్చితంగా ప్రమాణీకరించబడిన చరిత్ర మాత్రం కాదు; ఇది ప్రపంచ చరిత్రకు సంబంధించి రచయిత వ్యక్తిగత, నిస్సందేహంగా వాస్తవమైన, శాస్త్రీయమైన అభిప్రాయం. ఆయన, ప్రాచీన కాలం నుండి రెండవ ప్రపంచ యుద్ధం చివరకు మానవాళి చరిత్రను తెలియచేయడమేగాకుండా ఆయా సంఘటనలపై తన అభిప్రాయాలను వివరించాడు. ఈ గ్రంథం చారిత్రక క్రమం, ప్రపంచంలో వస్తున్న విప్లవాయుత మార్పుల సమ్మేళనం; ఇది, యీ మార్పులను శాసించే అత్యంత ముఖ్యమైన సాధారణ సూత్రాలను బయల్పెడల చేస్తుంది; పైగా గతం, వర్తమానాల మధ్య సంబంధాన్ని పేర్కొంటుంది,

భవిష్యత్తును ముందే చెబుతుంది. ఈ గ్రంథం యొక్క మహత్తర సాహితీ శైలి, జవహర్‌లాల్ నెహ్రూ సైద్ధాంతిక అభిప్రాయాలను ప్రపంచ దృక్పథాన్ని సులభంగా గ్రహించేట్టు చేస్తుంది; వాటికి సంబంధించి భావోద్వేగముద్రను కలుగజేస్తుంది.

1935 ఫిబ్రవరిలో, అల్మోరా జైలులో నెహ్రూ తన మరో గ్రంథం ఆఖరి పేజీ వ్రాశాడు; మొదట దానికి 'జైలు లోపల బయట' అని పేరు పెట్టాలనుకొన్నాడు; అయితే తరువాత 'ఓ జీవిత కథ' అని పేరుపెట్టాలని నిర్ణయించాడు.

ఆ గ్రంథం ఆఖరిమాటలో నెహ్రూ యిలా వ్రాశాడు: ''నేను జైలులో గడిపిన సంవత్సరాలా! ఒంటరిగా కూర్చుని, నా భావాలలో మునిగిపోయి ఎన్ని ఋతువులు గడచి వెళ్ళడాన్ని చూశాను ఒకరి నొకరిని మరచిపోతూ. నా యవ్వనం లోని ఎన్ని నిన్నటి రోజులు యిక్కడ సమాధి చేయబడినాయి: కొన్ని సందర్భాలలో యీ ఉద్విగ్న స్మృతులను బయటకు తెచ్చే మృతప్రాయమైన నిన్నటిరోజులనే పిశాచాలను నేను చూసేవాణ్ణి; అవి నా చెవిలో గుసగుసలాడేవి; ''ఇది అంత విలువైనదా?'' అని దీనికి చెప్పాల్సిన సమాధానం గురించి నేను వెనకాడను. ప్రస్తుతం వున్న విజ్ఞానంతో అనుభవం జోడించుకొని, మళ్ళీ నా జీవనం కొనసాగించడానికినాకు అవకాశం వచ్చినట్లయితే, నా వ్యక్తిగత జీవితంలో అనేక మార్పులు చేసుకొనేందుకు నేను నిస్సందేహంగా కృషి చేస్తాను. నేను పూర్వం చేసిన పనులను చాలా మెరుగు పరచుకొనడానికి కృషి చేస్తాను. అయితే ప్రజావ్యవహారాలలో అనేక ప్రధాననిర్ణయాలు అలాగే తాకకుండా మిగిలిపోయి వుండేవి.'' 1

1927 ఫిబ్రవరిలో బ్రస్సెల్స్‌లో జరిగిన పీడిత ప్రజల మహాసభలో నెహ్రూ భాగసామ్యం, అదే సంవత్సరం నవంబరులో ఆయన జరిపిన మాస్కో పర్యటన, సోషలిజం సిద్ధాంతం, ఆచరణలో, భారత ప్రజలు జాతీయ స్వాతంత్ర్యం, రాజకీయ, సామాజిక - ఆర్థిక స్వేచ్ఛలు సాధించే మార్గాలలో సజీవమైన ఆసక్తిని పెంపొందించాయి. ఈ విషయాన్ని ఆయన ఆత్మకథ నుండి తెలుసుకోవచ్చు.

ఆయన ఆత్మకథ ఒక విశ్లేషణా పూర్వక గ్రంథం; నెహ్రూ జీవితం లోని ఘటనల క్రమాన్ని తెలిపే గ్రంథం కాదది. దాని రచయిత, పాఠకులను తనవైపే ఆకర్షించాలన్న ప్రయత్నం చేయడు. వివాద రహితమైన సత్యాలను

1. జవహర్‌లాల్ నెహ్రూ, ఆత్మకథ "ముగింపు" పు. 597.

ప్రవచించే పవిత్ర వ్యక్తి పాత్ర తనదని చెప్పడానికి ఆయన ప్రయత్నించ లేదు. ఉన్నత నైతిక ఆశయాలుగల వ్యక్తి అయినందువల్ల, ఉదాశీనత, ఆత్మ సంతృప్తి అన్నవి ఆయన స్వభావానికి పరాయివి. ఆయన తనమీదే తానే తీర్పు చెప్పుకొంటాడు — ఆయనది సందేహించే, వాదనాపూర్వకమైన స్వభావం. నిర్మొహమాటంగా తాను చేసిన పొరపాట్లను అంగీకరిస్తాడు. తన నిర్ధారణలను ప్రశ్నించుకొంటాడు. చిత్తశుద్ధి కలవాడు. సత్యాన్వేషణలో నిలకడ కలిగిన వ్యక్తి.

ఈ గ్రంథంలో డజన్లమంది విభిన్న వ్యక్తులను గురించి నెహ్రూ వ్రాశాడు: వీరిలో నెహ్రూ మిత్రులు, ప్రత్యర్థులు వున్నారు. అయితే అను రాగంతోనో, విద్వేషంతోనో వ్రాయడు. కథనం, వాస్తవ దృష్టితో, కౌశలంతో, దయతో సాగుతుంది. అలాగే రచయిత విమర్శనలు చేయకమానడు; ఒక్కొక్కప్పుడు తీవ్రంగా విమర్శిస్తారు; తన సన్నిహిత సహచరులనుకూడా; మహాత్మాగాంధీ కూడా మినహాయింపు కాదు.

"నేను వారిని విమర్శిస్తున్నానంటే వారిపట్ల నాకు గౌరవంలేదని అర్థం కాదు" అని ఆత్మకథ మొదటి ముద్రణకు వ్రాసిన ముందు మాటలో నెహ్రూ వ్రాశాడు. "అయితే ప్రజా కార్యకలాపాల్లో ప్రవేశించేవారు పరస్పరం నిర్మొహమాటంగా వుండాలనీ, అలాగే తాము సేవచేసే ప్రజలయెడ గూడా యిదే నిర్మొహమాటాన్ని ప్రదర్శించాలని నేను అభిప్రాయపడ్డాను. మెచ్చుకోలు మర్యాద, యితరులను యిబ్బంది పెట్టడం ఎందుకులే అన్న అభిప్రాయం చాటున అసలు విషయాన్ని దాటవేయడం, కొన్ని సందర్భాల్లో కొన్ని బాధాకరమైన ప్రశ్నలు వేయడం—ఇవి పరస్పరం, లేదా మనం ఎదుర్కొంటున్న సమస్యలను నిజంగా అర్థం చేసుకొనడానికి తోడ్పడవు. భేదాభిప్రాయాలను గౌరవించడం, అలాగే ఉమ్మడి అంశాలను అంగీకరించడం, అవి ఎంత యిబ్బందికరమైనవైనప్పటికీ వాస్తవాలను ఎదుర్కొనడం — వీటిపై వాస్తవ సహకారం ఆధారపడి వుండాలి. నేను వ్రాసిన విషయాల్లో ఏ వ్యక్తికి వ్యతిరేకంగానైనా ద్వేషభావం, దుష్టబుద్ధి వుండదని నేను విశ్వసిస్తున్నాను" అని నెహ్రూ వ్రాశాడు.

ఆయన, ఎలాంటి సొగసైన భాషను ఉపయోగించక అత్యంత జటిలమైన విషయాలను సులభంగా, ప్రత్యక్షమైన పద్ధతిలో వివరిస్తాడు. నెహ్రూ తరచు తన అభిమాన కవులు వ్రాసిన పద్య భాగాలను, చరణాలను ఉటంకిస్తాడు; కొన్ని సందర్భాల్లో తన స్వంత కవితా ఖండికలలోని వాక్యాలను పాఠంలో పొందుపరుస్తాడు. ఆయన కవితా ధోరణి, సాహితీ శైలి కథాకథ

నంలో సంగమించి కరిగిపోయి, రాజకీయాలను, జీవంలేని చారిత్రక సత్యాలను స్పష్టమైన జీవన ప్రతీకలుగా మార్చుతాయి.[1]

పాఠకుడు, మానవతావాది, శ్రద్ధాళువైన రాజకీయవాది, ముగ్ధమోహన మూర్తి అయిన యీ రచయిత ఆత్మిక ప్రపంచంతో పరిచయం ఏర్పాటు చేసుకుంటాడు. ప్రజల, దేశం శ్రేయస్సు నెహ్రూ ఆత్మసాక్షి గౌరవాల నుండి అవిభాజ్యమైనది ; మిగతా అన్నింటికంటే దీనికి ప్రాధాన్యత వుంది.

1936 ఏప్రిల్‌లో ఆత్మకథ ప్రథమంగా ముద్రించబడింది. అది భారత దేశం, బ్రిటన్‌లలోని రాజకీయవాదుల, రాజనీతిజ్ఞుల, ప్రజల దృష్టిని ఆకర్షించింది. బ్రిటిష్ మితవాద పత్రికలు సైతం యీ గ్రంథం యోగ్యతలను అంగీకరించాయి.

నెహ్రూ యొక్క శక్తివంతమైన మేధోసంపత్తి - వారికి అర్థం అయిన మేరకు — (యూరోపియన్లకు సమగ్రంగా అవగాహన కాని గాంధీ చింతనా రీతితో పోల్చిచూస్తే) అవతలి పక్షానవున్న రాజకీయ ధృవంలాగా వున్నదని బ్రిటన్‌లోని ఉన్నత స్థానాల్లో వున్నవారు విచారం వెలిబుచ్చారు.

భారతదేశ భక్తులు ఆత్మకథను గొప్పగా శ్లాఘించారు. అభివృద్ధి నిరోధకుల, రాజీవాదుల విధానాన్ని బహిర్గతం చేయడానికి ఎంతగానో ఉపయోగపడగలదని వారు చెప్పారు. భారత దేశంలోని బూర్జువా — ఉదారవాద పత్రికలు నెహ్రూను తీవ్రంగా విమర్శించడంలో ఆశ్చర్యంలేదు ; ఉదారవాదులకు సంబంధించి ఆయన వ్యాఖ్యలు అటు అవమాన పరచేవిగానూ ఇటు తప్పుడుతడకలుగానూ వున్నాయని యివి ఆరోపించాయి. నెహ్రూ, శత్రువుల దాడులను తిరస్కరించాడు. ఉదారవాదుల లొంగుబాటు ప్రవర్తనకు సంబంధించి గ్రంథంలోని భాగాలను సవరించడానికి తిరస్కరించాడు. ఆత్మకథ వ్రాతప్రతి చదివిన అనంతరం మహాత్మాగాంధీ, యీ మార్పును చేయవలసిందిగా నెహ్రూకు విజ్ఞప్తి చేశారు కూడా ; అయితే నెహ్రూ అందుకు అంగీకరించలేదు.

తన అభిప్రాయమే సరియైనదన్న నెహ్రూ విశ్వాసం, రవీంద్రనాథ్ టాగూర్‌చే మరింత బలపరచబడింది; రవీంద్రనాథ్ టాగూర్ యీ గ్రంథంపై ఉన్నతమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

రెండవ ప్రపంచయుద్ధ కాలంలో నెహ్రూ మళ్ళీ జైలుకు వెళ్ళాడు ; క్రొత్త గ్రంథం వ్రాయడం ప్రారంభించాడు—తన ప్రియతమ దేశమైన భారత మాత గురించి చారిత్రక విశేషాలను తెలిపే గ్రంథం వ్రాయాలన్నది ఆయన

1. జవహర్‌లాల్ నెహ్రూ, ఆత్మకథ, ది బోడ్లీహెడ్ లండన్ 1953 పుట-XII

అభిమతం. 1944 లో నెహ్రూ యీ గ్రంథాన్ని పూర్తి చేశాడు; ఇది చాలా ప్రాముఖ్యతగల గ్రంథం; అది సంపూర్ణ రూపాన్ని యిచ్చేది; దీనికి **భారత దర్శనం** అన్న చక్కని, అర్థవంతమైన పేరు పెట్టాడు.

ఈసారి నెహ్రూ తన దేశ చరిత్రవైపు దృష్టి సారించాడు; భారతదేశ శక్తి, అలాగే దాని బలహీనతలను తాను అర్థం చేసుకొనడానికి తన దేశ వాసులకు తెలియ చెప్పేందుకు, ఆ దేశంయొక్క చేతనత్వం, వైభవం, వివేకాల రహస్యాలను బయల్పడం చేయడానికి, ఆ దేశానికి సంబంధించిన క్షీణ, వెనుకబాటుతనం, జడత్వ దశలను అర్థం చేసుకొనడానికి వీలుగా కీలక అంశాలను అన్వేషించేందుకు ఆయన తన దేశ చరిత్రవైపు మళ్ళాడు. కేవలం భారతదేశ చరిత్ర వ్రాయాలన్న కోరిక ఆయనకు లేదు. ఈ దేశం యొక్క ప్రధాన దశలను, తన కుమార్తెకు వ్రాసిన లేఖల్లో యిదివరకే అభివర్ణించాడు; గతకొద్ది దశాబ్దాల ఘటనలను తన ఆత్మకథలో వివరించాడు.

"శతాబ్దాల విజ్ఞానమే కాదు — వాటిలోని ఉన్మాదం కూడా మనలో పెల్లుబుకుతుంది. వాటి వారసులుగా మనం వుండడం అన్నది ప్రమాదకరం" అన్న జర్మన్ తత్వవేత్త నీట్షే మాటలను నెహ్రూ తన యవ్వన కాలంలో విన్నాడు. ఆనాడు కొందరికి ఆకర్షణీయంగావున్న యీ జర్మన్ తత్వవేత్త పొగరుమోతు, బుద్ధిహీన అభిప్రాయాలతో నెహ్రూ పాలుపంచుకోలేదు. "ఎంపిక చేయబడిన ధృడమైన వ్యక్తిత్వం" అన్న అతని భావనపట్ల అప్రమత్తంగా వున్నాడు. ఫాసిజం యొక్క జాత్యహంకార, మనుష్య ద్వేష సిద్ధాంతాలలోని దాని రాక్షస, భయంకర లక్షణాలను చూసిన నెహ్రూ నీట్షెజానికి మరింత గట్టిగా తన వ్యతిరేకతను పునరుద్ఘాటించాడు.

నీట్షె మాటలు నెహ్రూ స్మృతిపథంలో నిలిచిపోయాయి. ఎందుకంటే అది నీతి మాటలు కదా! వాటిలోవున్న హెచ్చరిక దృష్ట్యా, దానిని వ్యతిరేకించాలన్న ధృడమైన కోరిక ఆయనలో ఉద్భవించింది. "నేను దేనికి వారసుణ్ణి?" అని నెహ్రూ తనకుతాను ప్రశ్నించుకున్నాడు. తన జీవితానుభవం అందచేసిన విశ్వాసంతో సమాధానం చెప్పుకున్నాడు :

**"పదుల వేల సంవత్సరాలలో మానవాళి సాధించిన యావత్తుకు; అది భావించిన, అనుభవించిన, యిబ్బందుల పాలైన, సంతోషపడిన యావత్తుకు; దాని విజయఘోషలకు, దాని చేదు పరాజయ వేదనకు; ఎంత కాలం క్రితమో ప్రారంభమై, ఇంకా కొనసాగుతున్న, మనకు వెలుతురు నిస్తున్న మానవుని అద్భుత సాహసానికి; సర్వజనులలోనూ వున్న యీ యావత్తుకు, ఆ పైన వున్నదానికి" 1**

1. జవహర్‌లాల నెహ్రూ, భారత దర్శనం, పుట 25.

తన దేశచరిత్ర యొక్క వివేకం, దాని మహత్తర, అక్షయ ఆత్మిక వారసత్వం, వర్తమానానికి, భవిష్యత్తుకు దానిని ఎంతో నేర్పుగా, హేతు బద్ధంగా ఉపయోగించడం భారత ప్రజలకు ప్రాణపదమైనది అన్నదే భారత దర్శనం సారాంశం.

భారతదేశ ఈశాన్య ప్రాంతంలో సింధూనది లోయలో బయటపడ్డ పురాతన కట్టడాలను యీ గ్రంథం వివరిస్తుంది; పర్షియా, మెసపటోమియా, చైనా, ఈజిప్టులకు ఏమాత్రం న్యూనతగాలేని, ఒక విధంగా చూస్తే మెరుగైన మహోన్నతంగా అభివృద్ధి చెందిన నాగరికత 5 వేల సంవత్సరాలకుముందే భారతదేశంలో వున్నదని ఇవి రుజువు చేస్తున్నాయి. సామాజిక తిరుగుబాట్లు, పర్షియన్‌లు లేదా గ్రీకులు అయినప్పటికీ తరచుగా అనేకమంది రాజులు జరిపిన దండయాత్రలు, భారతదేశం యొక్క అధిక సంపద్వంత, విశిష్ట సంస్కృతి ఆవిర్భావం, అభివృద్ధిని అడ్డుకొనలేకపోయాయి. ఈ సంస్కృతి, ఆసియా అంతటావున్న ప్రజల ఆత్మిక జీవనంపై అద్భుతమైన ప్రభావాన్ని కలుగచేసింది.

ప్రాచీన కాలంలోని భారతీయ పండితులు, గణితశాస్త్రం, ఖగోళ శాస్త్రం, వైద్యం, లోహశాస్త్ర రంగాల్లో ప్రసిద్ధమైన అన్వేషణలు సాగించి ప్రపంచ విజ్ఞాన శాస్త్రాన్ని సంపద్వంతం చేశారు. ప్రతిభా వ్యుత్పత్తులుగల, పరిశ్రమశీలురైన ప్రజలు మాత్రమే సంస్కృతంవంటి భావప్రకాశత గల, మృదువైన భాషను సృష్టించగలరు. సంస్కృత వ్యాకరణం, మానవ హేతు బుద్ధి సృష్టించిన మహత్తర అంశాలలో ఒకటని చెప్పిన ప్రముఖ సోవియట్ పండితులు, విద్యావేత్త యఫ్. ఐ. ష్కెహర్ బద్స్కిని ఉటంకించడం నెహ్రూకు ఎంతో ఆనందం.

ఇలాంటి సాహిత్య - తాత్విక వ్యాసాల్ని ఉపయోగిస్తూ నెహ్రూ అతి నైపుణ్యంగా పాఠకుణ్ణి భారత చరిత్రలోగల లోతుపాతులగుండా నడిపిస్తాడు; అత్యంత జటిలమైన, వైరుధ్యపూరితమైన విషయాలను ప్రతిభావంతమైన, స్పష్టమైన, అద్భుతమైన వివరణలను యిస్తాడు. వ్యక్తుల ఆలోచనలు, కార్యాలపై బ్రహ్మాండమైన ప్రభావం కలిగింపచేసిన మహోన్నత భారతీయుల అద్భుత చిత్రణలను ఆయన పునఃసృష్టి చేశాడు. వారే — గౌతమబుద్ధ, మహావీర, కాళిదాస, శ్రీ రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, అరవింద ఘోష్, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణ గోఖలే, రవీంద్రనాథ్ టాగూర్ మహాత్మాగాంధీ, అనేకమంది యితరులు.

భారతదేశ చరిత్రలో నెహ్రూ, ఆయనతో పాటు పాఠకుడు చూసే స్వభావసిద్ధమైన లక్షణం యేమంటే స్వేచ్ఛాస్వాతంత్ర్యాల పట్లవున్న ఎన్నడూ మాసిపోని ఆకాంక్ష; విదేశీ పెత్తనానికి తలవంచరాదన్న సంకల్పం.

భారత దర్శనంలో, నెహ్రూ తాను సాక్షీభూతంగా వున్న, పాల్గొన్న తన ఆత్మకథలో వర్ణించిన గత దశాబ్దాల నాటి ఘటనలకు తిరిగివస్తాడు. దానిని వ్రాసిన పది సంవత్సరాల తర్వాత భారత స్వాతంత్ర్య పోరాటయోధులు పయనించిన సుదీర్ఘ, బాధాకరమైన మార్గాన్నంతటి వెనక్కు మళ్ళాల్సిన అవసరాన్ని ఆయన గుర్తించాడు; దూరదృష్టిని ఉపయోగించి విముక్తి ఉద్యమ విజయాల, అపజయాల కారణాలను సమీక్షించ వలసిన అవసరం ఉన్నదని అభిప్రాయపడ్డాడు. ఆయన చేసిన నిర్ధారణలు మహత్తరమైన ఆశావాదంతో కూడినవి; దేశవిముక్తి ఘడియ సమీపిస్తున్నది. ఈ విముక్తి అనివార్యం అని ఆయన విశ్వసించాడు; ఆ తర్వాత భారతీయులు, తమ వారసత్వాన్ని గర్వ కారణంగా ఎంచి, వారి మనస్సులను, హృదయాలను ఇతర ప్రజలకు, దేశాలకు విప్పి చూపించి ప్రపంచ ప్రజలుగా రూపొందుతారు. ఇతర ప్రజలతో కలిసివారు, ప్రాచీనకాలంలో ప్రారంభమైన, వారి పూర్వీకులు ఆరంభించిన అన్వేషణలో పాల్గొంటారు.

చింతనాపరుడు, సాహితీవేత్త అయిన నెహ్రూ సహజస్వభావం పిడివాదాన్ని ఆమోదించక పోవడం. చింతనాశక్తికి ఆకర్షితుడైన అన్వేషణ మానసీ అయిన నెహ్రూ జీవితంలో జరిగే సంఘటన, పరిణామాల పట్ల వాస్తవమైన దృక్పథం కలిగి వుంటాడు.

నెహ్రూ సహచరులు, ఆయన కుమార్తె చెప్పిన ప్రకారం మార్క్సిస్టు సిద్ధాంతం బ్రహ్మాండంగా ప్రభావితం చేసింది. నెహ్రూ, అనేకసార్లు తన వైఖరిని ఈ క్రింది విధంగా వివరించాడు: "జీవితం చాలా సంక్లిష్టమైంది; మన కున్న విజ్ఞానపరిధిలో దానిని అర్థం చేసుకొనడానికి సంబంధించి ఒక నిర్ణీత సిద్ధాంతం యొక్క నాలుగు మూలల్లో దానిని పరిమితంచేసి ఉంచడం అన్నది తర్క వ్యతిరేకమైనది"1

అయినప్పటికీ ఆయన అభిప్రాయాలు—మనం వాటి క్రియాశీలతను, సంపూర్ణతను తీసుకొన్నట్లయితే—అసలైనవి, విశిష్టమైనవి; ఇవి ఆయన్ను ప్రపంచ ప్రగతిశీల సిద్ధాంతవేత్తలలో ఒకరుగా, జాతీయ విముక్తి ఉద్యమ నాయకుడుగా, ఆ తరువాత అలీనోద్యమ నాయకుడుగా తయారుచేశాయి.

1. జవహర్‌లాల్ నెహ్రూ. భారత దర్శనం సంపుటి. 19.



భార్య కమల, కుమార్తె ఇందిరలతో జవహర్‌లాల్ నెహ్రూ



మొదటి ప్రపంచ యుద్ధం చివరకు నెహ్రూ భారత జాతీయ కాంగ్రెస్‌లో (ఐ. యన్. సి.) చేరాడు. కొత్త పార్టీపని పద్ధతులకోసం అన్వేషించడం ప్రారంభించాడు. అలాగే తాను ఆధారపడగల వ్యక్తుల కోసం వెదకడం ఆరంభించాడు. మహాత్మా గాంధీ బోధనవల్ల ఎంతో ప్రభావితం అయ్యాడు. అప్పుడు ఆయన తన మొదటి రాజకీయ చర్యలను తీసుకుంటున్నారు. గాంధీ వ్యక్తిత్వానికి, ప్రజలతో ఆయనకు గల ఆకర్షణకు, ఆయన ప్రతి పాదించిన నూతన ప్రతిఘటనా పద్ధతులకు, ఐ.యన్.సి ని రాజకీయ క్లబ్‌నుండి సమర్ధ వంతమైన ప్రజా సంస్థగా మార్చడానికి ఆయన చేసే కృషికి జవహర్‌లాల్ నెహ్రూ ప్రతి స్పందించాడు. గాంధీజీ అహింసాయుత పోరాట మార్గాలకు ప్రగాఢమైన నిబద్ధత కలిగినవాడయ్యాడు నెహ్రూ.

నెహ్రూ రచనలు, కార్యాచరణలో ప్రజాఉద్యమాలతో పెనవేసుకుపోయే ఉత్సాహవంతమైన భావాలకు సజీవ మూలాధారాలు. అవి, భారతదేశ చారిత్రక అభివృద్ధి దాని తత్వశాస్త్రం, సంస్కృతులయొక్క విశాలదృశ్యంగా ఉంటాయి; అలాగే అవి ప్రజాజీవనం, స్వాతంత్ర్యం, సామాజిక అభ్యుదయం, ప్రపంచ శాంతి యొక్క విజ్ఞాన సర్వస్వంగా ఉంటాయి.

# నెహ్రూ మరియు సోవియట్ యూనియన్

భారతదేశంలో సోవియట్‌పైన వెలువడిన గ్రంథాలలో ఒకటి జవహర్ లాల్ నెహ్రూ వ్రాసిన గ్రంథం. అది ఆయన సాహిత్య గ్రంథం.

దాని పేరు సోవియెట్ రష్యా. అలాగే ఇది వ్యాససంపుటి. రష్యాలో జరిగిన 1917 అక్టోబరు సోషలిస్టు విప్లవం 10వ వార్షికోత్సవం సందర్భంగా 1927 నవంబరులో సోవియట్ యూనియన్ పర్యటనపై ఆధారంగా యీ గ్రంథం వ్రాయబడింది.

రష్యా శ్రామికవర్గవిప్లవనాయకుడు వ్లదీమిర్ ఇల్యిచ్ లెనిన్‌పట్ల నెహ్రూకు ఎనలేని ఆసక్తి ఉండేది. 1917 చివరలో ఆయన్ను గురించి విన్నాడు. వార్తా పత్రికలు, ఇతర పత్రికలు, గ్రంథాల నుండి ఆయన గురించిన, ఆయన సైద్ధాంతిక రాజకీయ కార్యకలాపాల గురించిన సమాచారం విస్తృతంగా సేకరించాడు. ఎమిల్ లుడ్విగ్, లెనిన్ గురించి వ్రాసిన జీవిత సంగ్రహ వ్యాసాన్ని, అంటోన్‌కారల్‌గ్రెక్ వ్రాసిన బోల్షివిస్ట్ రష్యాను, బెట్రాండ్‌రస్సెల్ యొక్క థియరీ అండ్ ప్రాక్టీస్ ఆఫ్‌బోల్షివిజంను, జాన్‌రీడ్ వ్రాసిన టెన్‌డేస్ దట్ షుక్ ది వరల్డ్‌ను, ఇతర గ్రంథాలను ఆయన చదివాడు. గ్రంథాలు సమానమైన విలువైనవి కావనుకోండి; అయితే అందులో కొన్నింటిలో సోవియట్ రష్యా గురించిన నిజమైన సమాచారం వుంది. ఎక్కువ మంది రచయితలు రష్యా గురించి జాగ్రత్తతో కూడిన శత్రుత్వభావంతో వ్రాశారు; అంటోన్‌కారల్ గ్రెన్ వంటి కొంతమంది అచ్ఛాదిత విద్వేషంతో వ్రాశారు. జవహర్‌లాల్ నెహ్రూ, "బోల్షివిక్ ప్రమాదం"గా పిలిచే దానిని గురించి భయపడలేదు. సోవియట్ రష్యాను ప్రగతిశీల దేశంగా పరిగణిస్తూ దాని నాయకుడు మహత్తరమైన చింతనాశీలియనీ, విప్లవ ప్రతిభాశాలి అని ఆయన భావించాడు.

ఆ తర్వాత తన జ్యేష్ఠసోదరికి లేఖల ద్వారా నెహ్రూ, సోవియట్ యూనియన్‌లో తన పర్యటన చాలా తక్కువ రోజులపాటు సాగిందనీ. ఆ విశాలభూమి గురించిన మిడిమిడి జ్ఞానం అయినా సంపాయించడానికి ఒక మాసం రోజుల వ్యవధి కూడా చాలా తక్కువ కాలమేనని ఫిర్యాదు చేశాడు. మాస్కోలో ఉండగా ఆయన, ఏదో ఒకరోజున తప్పక భారతదేశం ఎదుర్కొనే కొన్ని సమస్యలను బోల్షివిక్‌లు పరిష్కరించిన తీరును పరిశీలించడానికి ప్రతిగంటను, అవకాశాన్ని ఉపయోగించుకొనడానికి ప్రయత్నించాడు.

రష్యాలోని మార్పుల్లో ప్రధాన అంశం నెహ్రూ తీక్షణ దృష్టినుండి తప్పించుకొనలేదు. ఆయన చూసినవి ఆయనపై మరచిపోరాని ముద్రను వేశాయి; సోవియట్ యూనియన్, సోషలిజంపట్ల తన ఆసక్తిని మరింతగా పెంచాయి.

రష్యా, భారతదేశాలు రెండింటినీ ఎదుర్కొంటున్న ఒకే రకమైన అనేక సమస్యలు, వాటికిగల పరిష్కార మార్గాలను పోల్చిచేసే విశిష్ట అవకాశాలను నెహ్రూకు అందచేశాయి. ఉదాహరణకు, సోవియట్ యూనియన్‌లో అనుసరించబడుతూవున్న జాతుల విధానంపై ఆయన ఇలా వ్రాశాడు:

"అల్ప సంఖ్యాకుల సమస్య అక్కడ చాలా ఎక్కువగా పరిష్కారం అయిందని గత ఐదు సంవత్సరాల కాలంలో సాధించబడిన ప్రగతి నుండి మనకు ఖచ్చితంగా కనపడుతుంది. భారతదేశంలో నూటయాభై సంవత్సరాలుగా సాగిన బ్రిటిష్‌పాలన పోల్చిచూస్తే ఈ విషయంలో ఎంత దుస్థితిలో వున్నామో అర్థం అవుతుంది. మనం ఒక్క విషయం చెప్పలేమా? ఈ సమస్యను పరిష్కరించాలని బ్రిటిష్‌పాలకులు అనుకోలేదు."1

సోవియట్ యూనియన్‌లో చూసిన దానిలో ఎక్కువభాగం భారతదేశంలో పూర్తి చేయాలని నెహ్రూ కోరుకున్నాడు. అయితే భారతదేశంలో సాధ్యమయ్యే మార్పులు రష్యాలో అమలు జరిపిన వాటికంటే భిన్నంగా ఉండాలని ఆయన గుర్తించాడు. భారతదేశ జాతీయ, చారిత్రక ప్రత్యేకతలు, ఆదేశ ఆర్థిక, సామాజిక అభివృద్ధి స్థాయిని అనుమతించవలసిన అవసరం ఉందని ఆయన భావించాడు. అది అత్యంత ఆసక్తిదాయకమూ, విలువైనదైనప్పటికీ విదేశీ అనుభవాన్ని గుడ్డిగా అనుకరించే ప్రశ్నేలేదు; ఎందుకంటే భిన్నపరిస్థితుల్లో ఈ అనుభవం కలిగింది. రష్యా, తన సమస్యలకు సంతృప్తికరమైన

1. జవహర్‌లాల్ నెహ్రూ, సోవియట్ రష్యా, సమ్‌రాండమ్ స్కెచెస్ అండ్ ఇంప్రెషన్స్, చేతన, బొంబాయి 1949. పుటలు, 83-84.

పరిష్కారాలను కనుగొన్నట్లయితే, భారతదేశ సామాజిక, సాంస్కృతిక అభివృద్ధికి ఎంతోదోహదం చేస్తుందిఅని తన గ్రంథంలోనే నెహ్రూ వక్కాణించాడు.

సోవియట్ యూనియన్‌లో తాను చూసినదంతా నెహ్రూ విమర్శనాత్మక మానసానికి ఆమోదయోగ్యంగా లేదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి బద్ధుడై వున్నందువల్ల, కార్యనిర్వాహక సంస్థలకున్న మితిమీరిన అధికారం, అలాగే రాజ్యవ్యవస్థ ఉపయోగించే నిర్బంధ పద్ధతులను ఆయన సహించలేదు. అయినప్పటికీ ఆయన నిర్ధారణలు ఆశావహమైనవి: "1917 విప్లవంవల్ల కలిగిన చలనశీలశక్తుల ప్రభావం యింకా వున్నది. అవి చరిత్రను సృష్టించాయి; అవి యింకాచరిత్రను సృష్టించుతూనే వుంటాయి. ఎవ్వరూ వాటిని విస్మరించ సాహసించలేరు."1 వాస్తవమైన పరిశోధకుడు కాబట్టి నెహ్రూ సోవియట్ యూనియన్ ఎదుర్కొంటున్న తీవ్రమైన యిబ్బందులను గమనించకపోలేదు. ఆయన యిలా వ్రాశాడు:

"రష్యాలో బోల్షివిక్ విప్లవం సంభవించి పదిసంవత్సరాలైంది. అయితే ఒక్క విషయం గమనంలో వుంచుకోవాలి. ఈ పది సంవత్సరాలలో ఐదు సంవత్సరాలపాటు విదేశీ, అంతర్గత శత్రువులకు వ్యతిరేకంగా పోరాటం జరిగింది; అలాగే క్షామం, దిగ్బంధనాలకు వ్యతిరేకంగా కఠినమైన పోరాటం జరిగింది..........

గత ఐదు సంవత్సరాల కాలంలోనే ఈ దేశంలో కొంత శాంతి ఏర్పడింది; ఆదేశం వనరులను పెంచుకొనడానికి అవకాశం కలిగింది. ఈకాలంలో కూడా యూరప్‌లోని అత్యధిక ప్రభుత్వాల, పెట్టుబడిదారీ దేశాల్లో అగ్రరాజ్యమైన అమెరికా శత్రుచర్యలకు వ్యతిరేకంగా నిలబడాల్సివచ్చింది· ఇన్ని కష్టాలు ఎదురైనప్పటికీ ఈ ఐదుసంత్సరాల కాలంలో అది ప్రగతి సాధించింది."2

ఆ కాలంలోనే_భారతదేశం స్వాతంత్ర్యం సంపాయించడానికి చాలా సంత్సరాల ముందే_తనదేశం సోవియట్లభూమితో విస్తృతమైన, మైత్రీ సంబంధాలు నెలకొల్పుకోవాలన్న ధృఢ అభిప్రాయయంతో వున్నారు. ఆయన ఇలా

1. జవహర్‌లాల్ నెహ్రూ, సోవియట్ రష్యా, సమ్ రాండమ్ స్కెచెస్ అండ్ ఇంప్రెషన్స్, చేతన, బొంబాయి, 1949 పుటలు. 126.
2. జవహర్‌లాల్ నెహ్రూ, సోవియట్ రష్యా, సం రాండం స్కెచెస్ అండ్ ఇంప్రెషన్స్. పు. 58.

వ్రాశాడు: "రష్యాను మనం విస్మరించజాలం. ఎందుచేతనంటే అది మన పొరుగుదేశం, శక్తివంతమైన పొరుగుదేశం. అదిమనతో స్నేహంగా వుంటుంది. మనతో సహకరించుతుంది. లేదా మనకు ముల్లుగా ఉండవచ్చు; ఏమైనప్పటికీ, మనం ఆ దేశాన్ని అర్థం చేసుకోవాలి, తెలుసుకోవాలి. తదనుగుణంగా మన విధానాన్ని మలచుకోవాలి."1 ప్రపంచ ప్రథమ సోషలిస్టు రాజ్యంతో పరస్పర అవగాహన, మైత్రిని నెహ్రూ కోరారు. ఈ అంశాన్ని ఆయన స్పష్టం చేశారు. "సాధారణంగా రష్యా, భారతదేశం ఉత్తమ ఇరుగు పొరుగు దేశాలుగా జీవించాలి."2

ఆ విధంగా భారతదేశం స్వాతంత్ర్యం సంపాయించడానికి యిరవై సంవత్సరాల ముందే ఆ దేశపు భవిష్యత్తు ప్రధాని, విభిన్న సామాజిక—రాజకీయ వ్యవస్థలుగల రాజ్యాల మధ్య శాంతియుత సహజీవనం, పరస్పర లాభదాయక సహకారం అన్న భావనను ధైర్యంగా అంగీకరించారు.

మాస్కోలో వుండగా నెహ్రూ, సోవియట్ యూనియన్ మిత్రుల ప్రపంచమహాసభకు అతిథిగా హాజరయ్యాడు. ప్రముఖ సోవియట్ పరిపాలనాదక్షులు, ప్రజానాయకులతో పరిచయం ఏర్పరచుకొన్నాడు.

సోవియట్‌యూనియన్‌లో తన పర్యటన, సోవియట్ నాయకులతో చర్చల అనంతరం, భారతదేశంపై దండయాత్ర చేయడానికి సోవియట్ యూనియన్‌కు ఎలాటి రాజకీయ, ఆర్థిక ప్రేరణలు లేవన్న నిర్ధారణలకు నెహ్రూ వచ్చాడు; సోవియట్‌యూనియన్‌కు సుస్థిరశాంతి అవసరంఅనీ యుద్ధం కోరడంలేదని నిర్ధారించుకున్నాడు. అలాగే భారతదేశంపై "దాడి చేయడానికి పథకాలు వేస్తున్నదన్న" మాటలు, భారతదేశంలో బ్రిటిష్‌పాలనను మరింత సుదృఢమొనర్చే, అక్కడ వలసవాద నిర్బంధ విధానాన్ని గట్టి పరచుకొనడానికి తీసుకునే చర్యలను సమర్థించుకొనేందుకు ఉద్దేశించిన సామ్రాజ్యవాదుల దుష్ప్రచారంలోని విద్రోహకర కట్టుకథలు అని ఆయన నిర్ధారించుకున్నాడు.

పండితుడుగా అలాగే ఆచరణాత్మక ప్రయోజనాలకోసం నెహ్రూ, 1917 అక్టోబరు సోషలిస్టు విప్లవం, సోవియట్ యూనియన్ యొక్క సోషలిస్టు నిర్మాణానుభవాలను పరిశీలించాడు. ఆయన సోవియట్‌యూనియన్ చరిత్రను

1. జవహర్‌లాల్ నెహ్రూ, సోవియట్ రష్యా, సం రాండం స్కెచెస్ అండ్ ఇంప్రెషన్స్, పుట. 3.
2. అదే పుస్తకం. పుట. 131.

అధ్యయనంచేశాడు; నూతన ఆర్థికవిధానాన్ని విశ్లేషించాడు. సోవియట్ యూని: యన్ విదేశాంగవిధానానికి సంబంధించి ఆయన యిలా వ్యాఖ్యానించాడు "చైనా, టర్కీ, పర్షియా, ఆఫ్ఘనిస్తాన్ లాంటి తూర్పుదేశాల పట్ల సోవియట్లు చాలాఉదారమైన వైఖరిని అవలంబించారు. జారిస్టు ప్రత్యేకసౌకర్యాలను వదులుకున్నారు. ఇది, పీడిత, తాడిత ప్రజలందరికీ స్వాతంత్ర్యం అన్న తమ సూత్రాలకు అనుగుణంగా వున్నది....... సోవియట్‌యూనియన్ ప్రదర్శించిన యీఔదార్యం ఇంగ్లండ్‌లాంటి సామ్రాజ్యవాద దేశాలను చిక్కుల్లో పెట్టింది. తూర్పు దేశాలు వీటినన్నింటినీ పోల్చి చూసుకున్నాయి. ఇవి ఇంగ్లండ్, తదితర దేశాలకు అనుకూలంగా లేవు"1

1936లో మహాత్మాగాంధీ ప్రతిపాదనమీదట భారత జాతీయ కాంగ్రెస్ యొక్క అత్యంత వున్నతపదవికి నెహ్రూ నియమించబడి ఎన్నికయ్యాడు. కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించిన అనంతరం చేసిన ప్రారంభోపన్యాసంలో ఆయన భారతదేశం యొక్క వెనుకబాటుదనం, దారిద్ర్యాలను నిర్మూలించడానికి ఏకైక మార్గం సోషలిజం అని స్పష్టం చేశాడు.

రెండవ ప్రపంచయుద్ధసన్నాహాలు ప్రారంభంఅయినప్పుడు, సామ్రాజ్య జ్యవాదుల మధ్య ప్రమాదకర శతృత్వం, వలసలను తిరగి పంచుకోవాలన్న వారి కోర్కెను, ఆ విధంగా ప్రపంచ ప్రథమ సోషలిస్టు రాజ్య మనుగడకు సృష్టించబడిన విపత్తులను గురించి ఇలా వ్రాశాడు. "జర్మనీలో నాజీ ప్రభుత్వం తలెత్తినందువల్ల రష్యాకు కొత్త, దురాక్రమణ పూరిత బద్ధశతృవు ఏర్పడినాడు"2 అని పేర్కొన్నాడు. ఆయన ఇంకా ఇలా వ్రాశాడు; "........ బ్రిటిష్ విధానం దాదాపు ఫాసిస్టు అనుకూల నాజీ విధానంగా వున్నది. 'రాత్రికి రాత్రిగాని విధానం ఆకస్మికంగా మారుతుందనీ, అది స్వాతంత్ర్యాన్ని ప్రజాస్వామ్యాన్ని కాపాడుతుందనివిశ్వసించడం కష్టం. దానిపెత్తందారీ సామ్రాజ్య వాద దృక్పథం తన సామ్రాజ్యాన్ని అంటి పెట్టుకోవాలన్న కోరిక, యీ పరిణామాలు జరుగుతున్నప్పటికీ కొనసాగుతున్నాయి. రష్యాకు, రష్యాకు ప్రాతినిధ్యం వహించేవాటికి ఇది పూర్తి వ్యతిరేకంగా వున్నది. అయితే ఒక్క విషయం తేటతెల్లమవుతున్నది. హిట్లర్‌ను సంతృప్తిపరచడానికి సకల ప్రయత్నాలు చేసినప్పటికీ అతడు యూరప్‌లో ఆధిపత్యశక్తిగా రూపొందుతున్నాడు; పాత సమతూకాన్ని పూర్తిగా తల్లక్రిందులు చేస్తున్నాడు; బ్రిటిష్ సామ్రాజ్య వాద కీలక ప్రయోజనాలకు ప్రమాదం కలిగిస్తున్నాడు."3

1. జవహర్‌లాల్ నెహ్రూ ప్రపంచ దర్శనం. పుట, 658.
2. అదే పుస్తకం, అదేపుట.
3. జవహర్‌లాల్ నెహ్రూ, భారతదర్శనం, పుట, 424.

యీపత్తు ప్రపంచం చూసేట్టు బహిరంగంగా రెండవ ప్రపంచయుద్ధ సన్నాహాలు జరగడం, యీ సన్నాహాలకు తగునైన ఎదురుదెబ్బ తగలక పోవడం చూసి నెహ్రూ ఆగ్రహావేశ పరుడయ్యాడు. తాము ఉమ్మడి చారిత్రక భవితవ్యాన్ని పాలుపంచుకొంటున్నామని గుర్తించకుండా మానవాళిఅనైక్యంగా వున్నందుకు ఆయన విచారం వ్యక్తం చేశాడు. వివిధ దేశాల్లో, అన్ని వర్గాలు, సామాజిక బృందాలు "తమ రాజ్య వ్యవస్థ ఉన్నత ప్రయోజనాలంటూ" వాదించడం ప్రారంభించారు; సంకుచిత భావాలుగల జాతీయవాదం అన్ని చోట్ల ఆవరించింది. కొన్ని దేశాల్లో మానవులను కేవలం రాజ్య వ్యవస్థ యంత్రాంగంలోని విడిభాగంగా చూశారు; మరికొన్ని దేశాలు వారిని లాభాలు తెచ్చే సజీవంగల సరకులుగా భావించారు; ఇంకా కొన్ని దేశాల్లో వారిని అధికారంలో వున్నవారికొరకు ప్రపంచాన్ని జయించితెచ్చే కర్తవ్యపరాయణు లైన సైనికులుగా చూశారు.

అయినప్పటికీ ఎక్కువ భాగం ఆ దేశాలు ముంచుకొస్తున్న యుద్ధాన్ని చూసి భయపడ్డాయి; యుద్ధానికి హేతుబద్ధమైన ప్రత్యామ్నాయం "అంగీకృత" లేదా "రాజీ"తో కూడిన శాంతి అని మాట్లాడడం ప్రారంభించాయి. అయితే అలాంటి శాంతి గురించి చర్చిస్తూనే పశ్చిమదేశాలు తమ స్వార్థప్రయోజనాలను మాత్రమే కాపాడుకొనే విధంగా ఆలోచనలు చేశాయి. దీనివల్ల దురాక్రమణ దారు ముందు యీ దేశాలు బలహీనపడడమే జరిగింది.

ఇలాంటి విధానం అవలంబించే దేశాలు చివరకు యుద్ధం సుడి గుండంలో చిక్కుకొని పోయాయి. యూరోప్ ఫాసిజం పాదాల క్రిందకు వచ్చింది. జర్మనీ, ఇటలీ, జపాన్ దురాక్రమణ సైన్యాల "అజేయశక్తి"ని చూసి ప్రపంచం భయవిహ్వలమైంది.

ఈ యుద్ధానికి బాధ్యులైనవారు దానిని నిరోధించలేక పోయినవారేనన్నది నెహ్రూ విశ్వాసం; అనగా మూనిచ్ ఒప్పందాన్ని అనుమతించినవారు, జెకోస్లోవేకియా ఆక్రమణపట్ల, నాజీ జర్మనీకి ఆస్ట్రియాను కలపడంపట్ల మిన్నకుండినవారేనని ఆయన విశ్వాసం; ఫాసిస్టు దురాక్రమణదారులను తమ స్వంత సరిహద్దులకు రానీయకుండా చేసుకొని తూర్పుకు అనగా సోవియట్ యూనియన్ వైపు పురోగమించవలసిందిగా ప్రోత్సహించినవారేనని నెహ్రూ విశ్వాసం. యుద్ధానికి ముందు ఆయుధ పోటీలో పాల్గొని, యుద్ధము, రాక్షసమైన హింస అనే మార్గాల ద్వారా తమ సమస్యలను పరిష్కరించు కోవాలన్న అభిప్రాయంతో సైనికవాదాన్ని పెంచి పోషించిన వారిదందరిదీ యీ నేరం.

నెహ్రూ, భారత జాతీయ కాంగ్రెస్ అంతర్జాతీయ శాఖ అధిపతిగా వుండేవాడు — ఫాసిస్టు వ్యతిరేక, అంతర్జాతీయవాద దృక్పథాన్ని గైకొన్న పార్టీ విదేశాంగ విధానాన్ని విశదీకరించిన ఖ్యాతి ఎక్కువభాగం నెహ్రూకు చెందుతుంది. సోవియట్ యూనియన్‌పట్ల సానుభూతిగా వున్నట్లు, ఫాసిస్టు మూకల ప్రధాన దాడిని ఎదుర్కొన్న సోవియట్ ప్రజల భవితవ్యంపట్ల చిత్తశుద్ధితో ఆదుర్దా ప్రకటించింది నెహ్రూ అని ఆయన రచనలు, అనేక బహిరంగ ప్రకటనలు తెలుపుతాయి.

సోవియట్ యూనియన్‌పై నాజీ జర్మనీ దాడి వార్తలు జవహర్‌లాల్ నెహ్రూను తీవ్రంగా కలవరపరిచాయి. నాజీ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాన్ని ఆయన ఎంతో ఆసక్తితో గమనించాడు. సోవియట్ ప్రజల విజయాన్ని మనసారా కోరుకున్నాడు. ఎందుకంటే సోవియట్ యూనియన్ యుద్ధంలో ప్రవేశించడంతో దాని స్వరూపం, స్వభావం మారిపోయాయని ఆయనకు తెలుసు. భారతదేశంలోని చిత్తశుద్ధిగలవారి సానుభూతులన్నీ సోవియట్ యూనియన్‌తో వున్నాయి. ఫాసిజాన్ని మట్టుపెట్టగల శక్తి అది ఒక్కటేనని వారు భావించారు.

1941 డిసెంబరులో నెహ్రూ తన కుమార్తె ఇందిరతో, భారతదేశంలో నివసించి పనిచేసిన ప్రఖ్యాత రష్యన్ చిత్రకారుడు, పౌర ప్రముఖుడు అయిన నికొలాయ్ రోరిచ్‌ను చూడడానికి కులూకు వెళ్ళాడు. భారత — రష్యా అసోసియేషన్ సంస్థాపనా సమస్యపై ఆయనతో చర్చించాలని నెహ్రూ అనుకున్నాడు. ఎంత విభ్రాంతికర విషయం! సోవియట్ ప్రజలకు సంబంధించి యుద్ధం అత్యంత విషాదకర దశలో వుండగా యిలాంటి సమస్యను చర్చించడమా! సోవియట్ ప్రజల అనివార్య విజయంలో ఆయనకున్న విశ్వాసం మిక్కుటమై అలా చేసివుండవచ్చు!

1942 ఆగస్టులో నెహ్రూ, మహాత్మాగాంధీలు, కాంగ్రెస్ యొక్క ప్రసిద్ధ క్విట్ ఇండియా తీర్మానం విశదీకరణ, ఆమోదించడంలో పాల్గొన్నారు. వలసవాదులు భారతదేశాన్ని వదలి వెళ్ళమని డిమాండ్ చేయడంతోపాటు అది ఫాసిజానికి వ్యతిరేకంగా సోవియట్ ప్రజలు జరుపుతున్న పోరాటంపట్ల సంఘీభావాన్ని వ్యక్తం చేసింది.

మళ్ళీ జైలుకు వెళ్ళిన నెహ్రూ మామూలుగానే సాహిత్య రచనలో కూరుకొనిపోయాడు; భారత-సోవియట్ సంబంధాల అవకాశాలను పరికించి చూశాడు. ఆయన ముందే వూహించి చెప్పాడు: యుద్ధం తరువాత ప్రపంచం



తన దేశానికి చెందిన మహత్తర వ్యక్తి రవీంద్రనాధ్ టాగూర్. మానవతావాద. దేశభక్తి ప్రపూరిత అభిప్రాయాలను జవహర్‌లాల్ పాలుపంచుకున్నాడు. **వాటిలో** తన నిజ నిర్ధారణలు వున్నాయని నెహ్రూ తెలుసుకున్నాడు.



జవహర్‌లాల్ నెహ్రూ తనను రాజకీయాలకే పరిమితం చేసుకొనలేదు. ఆయన ఉన్నత పరిజ్ఞానంగల వ్యక్తి. సర్వవిజ్ఞాన ఖని తాత్విక చింతన కలవాడు. ఆయన అపారమైన సాహిత్య వారసత్వాన్ని వదలి వెళ్ళాడు. అందులో ఆయన విశ్వజనీన విజ్ఞానాన్ని, విశాల ప్రయోజనాలను, తనదైన, పదునైన మనస్సును, అంతర్గత మహోత్సాహంతో చేతనత్వంతో రంగరించాడు. నిత్య అన్వేషణ పూర్వక లక్షణం గల యోధుడైన నెహ్రూ కొన్ని సందర్భాలలో సందేహాలకు చిక్కేవాడు; పురోగమించేవాడు; అయితే అభ్యుదయంలో విశ్వాసాన్ని ఉంచుకొనేవాడు.

మారిపోతుంది, ప్రజాస్వామ్య, అభ్యుదయ శక్తులు విజయం సాధిస్తాయి, సామ్రాజ్యవాదానికి, వలసవాద విధానానికి నిశ్చయాత్మకమైన చావు దెబ్బ తగులుతుంది.

"రష్యాలో అధికారంలో వున్నవారు లేదా సాధారణంగా ప్రజలు భారతదేశం గురించి యేమి అనుకొన్నారో చెప్పడం అసాధ్యం" అని స్పష్టీకరించారు. "వారు బ్రహ్మాండమైన యుద్ధ ప్రయత్నాలలో తలమునకలై వున్నారు. తమ దేశం నుండి దురాక్రమణదారును గెంటివేసే ప్రయత్నంలో వున్నారు. తక్షణావశ్యకత గాని విషయాల గురించి ఆలోచించడంలేదు. అయినప్పటికీ ఎంతో ముందు ఆలోచనతో వున్నారు. వారు భారతదేశాన్ని విస్మరించలేదు. ఆసియాలోని వారి సరిహద్దుల్లో భారతదేశం వుంది వారి భవిష్యత్తు విధానం యేమిటో ఎవ్వరూ చెప్పలేరు. అయితే అది వాస్తవమైనదిగా మాత్రం వుంటుంది."1 ఈ ముందు మాటను జీవితం రుజువు చేసింది.

1944, జూన్ 15న నెహ్రూ, భారత జాతీయ కాంగ్రెస్‌కు చెందిన యితర నాయకులు జైలు నుండి విడుదలయ్యారు. తక్షణమే ఆయన, బ్రిటిష్ వలసవాదులకు వ్యతిరేకంగా సాగుతున్న నిశ్చయాత్మక, తుదిపోరాటంలో చేరాడు. 1946 ఆగస్టు చివరలో భారతదేశంలో, వైస్‌రాయ్ నాయకత్వాన తాత్కాలిక పరివర్తనాకాల జాతీయ ప్రభుత్వం ఏర్పడింది. ఈ ప్రభుత్వంలో నెహ్రూ కార్యనిర్వాహక మండలి ఉపాధ్యక్షుడుగా వున్నాడు. విదేశీవ్యవహారాలు, కామన్వెల్తు సంబంధాల శాఖ నిర్వహించాడు. స్వాతంత్ర్య సిద్ధికి ఒక సంవత్సరం ముందు 1946 సెప్టెంబరు 7న రేడియో ప్రసంగంలో భారతదేశ భవిష్యత్తు విదేశాంగ విధాన ప్రాతిపదికను వివరించాడు. తమ దేశం ప్రత్యర్థి సైనిక కూటములతో సంబంధం పెట్టుకోదనీ, సకల దేశాలతోనూ స్నేహ సంబంధాలు నెలకొల్పుకుంటుందని ఆయన నిర్మొహమాటంగా చెప్పాడు. సకల వలసవాద, పరాధీన దేశాల విముక్తిపట్ల భారతదేశం శ్రద్ధ కనపరుస్తుందని ఆయన చెప్పాడు. నెహ్రూ ఆ ప్రసంగంలో సైనిక కూటముల్లో భారతదేశం చేరకూడదన్న విషయాన్ని స్పష్టంగా పునరుద్ఘాటించాడు. యుద్ధం నివారణకు, శాంతి సంరక్షణకు పోరాటాన్ని కొనసాగించాలని పిలుపు యిచ్చాడు. వలసవాదానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా భారత దేశానికున్న వైఖరిని వివరించాడు. భారతదేశంయొక్క విదేశాంగ విధాన, అంతర్జాతీయ సంబంధాల నూతన సూత్రాలను రూపొందించాడు. ఈ సూత్రాలు చాలాకాలం "నిర్మాణాత్మక తాటస్థ్యం" విధానానికి ప్రాతిపదికగా వుండేవి. 1950 దశకం మధ్య భాగాన్నుండి అవి అలీన విధానంగా మారాయి. భారత ప్రజలనుద్దేశించి చేసిన

1. జవహర్‌లాల్ నెహ్రూ, భారత దర్శనం పుట. 502

ప్రసంగంలో నెహ్రూ. సోవియట్ యూనియన్ సమకాలీన ప్రపంచంలో మహత్తర దేశం అని అన్నారు. ఆసియాలో యిరుగు పొరుగు దేశాలు కాబట్టి యీ రెండు దేశాలు అనేక ఉమ్మడి సమస్యలను సంయుక్తంగా పరిష్కరించు కొంటాయన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు.

1947 ఏప్రిల్ 13న. భారత స్వాతంత్ర్య ప్రకటనకు నాలుగు నెలల ముందు, సోవియట్ యూనియన్‌తో దౌత్యసంబంధాలు నెలకొల్పుకునే సమస్యను నెహ్రూ పరిష్కరించాడు. తన స్వంత సోదరి విజయలక్ష్మి పండిట్‌ను మాస్కోలోని రాయబారిగా నియమించాడు. గడిచిన సంవత్సరాల కాలంలోవున్న యిబ్బందులను సర్దుబాటు చేసుకొని సోవియట్ యూనియన్‌తో సంబంధాలను మరింతగా పెంచుకొనడానికి సాధ్యమైనదంతా చేయవలసిందిగా యావత్తు రాయబార కార్యాలయ సిబ్బందిని వ్యక్తిగతంగా ఆదేశించారు — ఇది ఆయన ఆజ్ఞ. ఇప్పుడు రెండు దేశాలకు విశాల పునాది ఏర్పడింది. దీనిమీద అన్ని స్థాయిల్లోనూ, అన్ని రంగాల్లోనూ మైత్రీ సంబంధాలు, సహకారం అభివృద్ధి చెందుతాయి.

1955 జూన్‌లో, సోవియట్ యూనియన్‌లో తన మొదటి పర్యటన జరిగిన యిరవై ఎనిమిది సంవత్సరాల తరువాత, స్వతంత్ర భారత ప్రధాన మంత్రిగా నెహ్రూ అధికార పర్యటన జరిపాడు. శతాబ్దాలుగా ఒకదానితో ఒకటి సంబంధాలు పెట్టుకొనకుండా ఏదో అడ్డుకొన్నట్టుగా కనపడుతున్నది. కానీ యీనాడు వాటిని విడదీసే అవరోధాలు అన్నీ విధ్వంసం చేయబడినాయి. అవి పరస్పరం తమ హృదయాలను విప్పుకున్నాయి.

నెహ్రూ అనేక నగరాలకు, పట్టణాలకు, ఆవాసాలకు వెళ్ళాడు; పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు, కర్మాగారాలు, నిర్మాణంలో వున్న ప్రాజెక్టులు, ఉమ్మడి వ్యవసాయ క్షేత్రాలు దర్శించాడు; యంగ్ పైనీర్ కాంప్‌లు, కిండర్ గార్టెన్‌లు చూశాడు; సంగీత సభలు, స్టేడియంలలో క్రీడలకు హాజరయ్యాడు. ఆయన పూర్తి శక్తితో, అలసట లేకుండా ముందుకు సాగేవాడంటే ఆయన భద్రతా సిబ్బంది సైతం ఆయనతో నడవగలిగేవారు కాదు. ప్రతిదీ తెలుసుకోవాలనీ, ఆ దేశం యొక్క మొత్తం అనుభవం జీర్ణించుకొని, దానిని విమర్శనాత్మకంగా పరిశీలించి, భారతదేశంలో యీ అనుభవాన్ని అనువర్తింపచేయాలని నెహ్రూ అనుకొన్నాడు.

తాను ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న, సర్వసన్నాహాలతో జరిపిన నెహ్రూ పర్యటన అతని అంచనాలను, ఆశలను నెరవేర్చింది. సామ్రాజ్యవాద

దేశాల వలసవాద, నయావలసవాద విధానానికి వ్యతిరేకంగా తాను చేస్తున్న పోరాటానికి ఆయనకు సోవియట్ యూనియన్‌లో సంపూర్ణ తోడ్పాటు లభించింది. శాంతిని సంరక్షించి సుదృఢమొనర్చడం, విభిన్న సామాజిక-రాజకీయ వ్యవస్థలుగల దేశాలమధ్యగల సంబంధాల్లో శాంతియుత సహజీవన సూత్రాలు సంఘటితం కావడం అన్న ఆయన ఆశలను అక్కడ సంపూర్ణంగా శ్లాఘించారు. నిరాయుధీకరణ సమస్యలపై సోవియట్ యూనియన్ నిర్మాణాత్మక వైఖరికి, శాంతియుత మార్గాల ద్వారా వివాదాస్పద అంతర్జాతీయ సమస్యలు పరిష్కరించాలని దాని వక్కాణింపులు ఆయన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

సోవియట్ నాయకులతో ఆయన జరిపిన చర్చల్లో, ఉభయ దేశాల మధ్య ఆర్థిక, శాస్త్రీయ-సాంకేతిక, సాంస్కృతిక సహకారానికి సంబంధించిన అనేక సమస్యలపై సంతృప్తికరమైన పరిష్కారమార్గాలు కనుగొనబడినాయి. భిలాయ్ ఇనుము - ఉక్కు కర్మాగారంతోసహా అనేక ప్రధాన పారిశ్రామిక పథకాలను భారతదేశంలో అంగీకరించడానికి సోవియట్ యూనియన్ అంగీకరించింది. ఈనాడు యీ ఉక్కు కర్మాగారం పారిశ్రామిక అతిపెద్ద కర్మాగారాల్లో ఒకటి. వీటినే నెహ్రూ ఆధునిక భారత "నూతన దేవాలయాలు" అని పిలిచాడు.

విదేశీ ఆర్థిక పరాధీనత నుండి, నయా వలసవాద రహస్య రూపాల నుండి తన దేశాన్ని బయట పడవేయాలన్న నెహ్రూ స్వప్నం ఫలించుతూ వుండింది.

1955 లో జరిగిన సోవియట్-భారత శిఖరాగ్ర సభ కూడా గణుతింపదగినది. ఉభయ దేశాల నాయకుల పరస్పర అధికార పర్యటనల చెరగని సుసాంప్రదాయాన్ని యీ సభ ఆవిష్కరించింది. ఇది ఈరోజున సోవియట్ - భారత ప్రజల పరస్పర అవగాహన, సహకారం, స్నేహాలను పెంపొందంచే ఉత్తమ లక్ష్యాన్ని నెరవేరుస్తున్నది.

నెహ్రూ తుదిగా 1961 లో సోవియట్ యూనియన్‌లో పర్యటించాడు. ఇది యింతకుముందు తాను జరిపిన పర్యటనకంటే తక్కువ వ్యవధి కలది. అయితే తక్కువ ఫలప్రదం కాలేదు. సోవియట్, భారత దేశాలమధ్య మైత్రీ సంబంధాలు స్వల్పకాలిక - రాజకీయ పరిగణనల మీదగాక, ప్రపంచ శాంతిని సంఘటితం చేయడం, పరస్పర లాభదాయక విస్తృత సహకారాలను పెంపొందించడంలో ఉభయ దేశాల యొక్క ప్రాణప్రద ప్రయోజనాల నుండి ఉద్భవించిన శాశ్వతంగా పనిచేసే అంశాలపై నిర్మించబడినాయని యిది ధృవీకరించింది. ఇక్కడ ఒక్క విషయాన్ని వక్కాణించాలి: అగ్రరాజ్యాలకు

"సమాన దూరంగా వుండాలన్న" కోరికతో నెహ్రూ తన అలీన విధానాన్ని చూడలేదు. అంతర్జాతీయ సంబంధాల చరిత్రలో భారత - సోవియట్ మైత్రి ఒక విశిష్టమైన పరిణామమని ఆయనకు సంపూర్ణంగా తెలుసును.

ఆ తరువాత వచ్చిన భారత ప్రభుత్వాలు కూడా అనుసరించిన నెహ్రూ విదేశాంగ విధానం సోవియట్‌తో అచంచల మైత్రీ సంబంధాల నుండి బయలు దేరుతుంది. అది శాశ్వత మానవ విలువలపై సంస్థాపించబడింది; ఈ భూమండలంలో నాగరికత బ్రతికి బట్టకట్టాలన్న రెండు దేశాల వాంఛితము, అంతర్జాతీయ కార్యకలాపాలచేత, శాంతి, స్వేచ్ఛ, అభ్యుదయాల వైపు చారిత్రక పథాన్ని ప్రపంచ ప్రజలు అన్వేషించేట్లుచేసే సమిష్టి ప్రయత్నంచేత యిది ఉత్తేజితమైంది. ఈ విధానం ఎన్నడూ, ఏ దేశ న్యాయబద్ధ ప్రయోజనాలను వ్యతిరేకించలేదు. మానవాళి ఉమ్మడి లక్ష్యాలతోగల దాని అన్ని ప్రధాన ప్రమాణాలకు అనుగుణంగా వుంది.



సోవియట్ యూనియన్‌లో కమ్యూనిజం, సోషలిజం యొక్క కొన్ని అంశాలపట్ల నెహ్రూ వైఖరికి సంబంధించి ఎంతో చెప్పారు; వ్రాశారు. ఈ విషయంపై ఉపన్యాసాలు, గ్రంథాలు వ్రాశారు.

శాస్త్రీయ సోషలిజం భావాలకుగల తన నిబద్ధతను ఆయన ఎన్నడూ తిరస్కరించలేదన్నది అందరికీ తెలిసిందే. "మార్క్సిజం సిద్ధాంతం, తత్వ శాస్త్రాలు నా మనస్సులోని అనేక చీకటి కోణాలను వెలిగించాయి" అని ఆయన వ్రాశాడు. "చరిత్ర నాకు కొత్త అర్థాన్ని యిచ్చింది. మార్క్సిస్టు భాష్యం దానిపై కాంతి పుంజాలను కుమ్మరించింది. ఏదో ఒక వ్యవస్థ, ప్రయోజనాలకై ఆవిష్కరింపబడే నాటకంగా అది రూపొందింది."1

అయితే మార్క్సిజం పిడివాదులు అంటే ఆయనకు ఎంతో ఒళ్ళుమంట. "మార్క్స్ యొక్క సామాజిక అభివృద్ధి సాధారణ విశ్లేషణ చాలా సవ్యమైనది. అయితే ఆ తరువాత అనేక పరిణామాలు సంభవించాయి. అద్యతను భావికి సంబంధించిన ఆయన దృక్పథంలో యివి యిమడలేదు. లెనిన్ విజయవంతంగా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆ తర్వాత సంభవించిన పరిణామాలకు

1. జవహర్‌లాల్ నెహ్రూ, ఆత్మకథ పు. 332

అనువర్తింప చేశాడు. తిరిగి అప్పటినుండే యింకా గణనీయమైన పరిణామాలు జరిగాయి. సాంకేతికశాస్త్రం యొక్క అతి శీఘ్రతర అభివృద్ధి, శాస్త్రీయ విజ్ఞానంలో వస్తున్న అపారమైన మార్పుల ప్రత్యక్ష అనువర్తింపులు, ఆశ్చర్యకరమైన వేగంతో, నూతన సమస్యలకు త్రోవతీస్తూ యీనాడు ప్రపంచ చిత్రాన్ని మార్చివేస్తున్నది."1

1940 లో వ్రాసినా యీ మాటలు యింకా బాగా కాలానుగుణమైనవి. మార్క్సిజం ఆర్థిక సిద్ధాంతం, ప్రపంచ ప్రథమ సోషలిస్టు దేశంలో దానిని అనువర్తింప చేసినందువల్ల కలిగిన ఫలితాలపట్ల నెహ్రూకు ప్రత్యేకమైన ఆసక్తి వుంది. ఆయన ప్రధానంగా సోషలిజాన్ని, తమ ఆర్థిక, సాంస్కృతిక వెనుకబాటు తనాన్ని శీఘ్రంగా అధిగమించడానికి నూతనంగా విముక్తి పొందిన ఆసియా, ఆఫ్రికా దేశాలు ఉపయోగించాల్సిన శక్తివంతమైన సాధనం అని ఆయన పరిగణించాడు. ఆయన చొరవ, వత్తిడులవల్ల భారత జాతీయ కాంగ్రెస్, భారతదేశంలో సోషలిస్టు తరహా సమాజ నిర్మాణ కర్తవ్యాన్ని తన కార్యక్రమంలో జోడించింది.

నెహ్రూ "సోషలిజం" ఆచరణలో మిశ్రమ ఆర్థిక వ్యవస్థ. ఇందులో సోవియట్ యూనియన్, యితర సోషలిస్టు దేశాల సహాయంతో నిర్మించిన అతి శక్తివంతమైన ప్రభుత్వరంగంలో విస్తృతమైన, స్వేచ్ఛాయుత ప్రైవేటు సంస్థలు సహజీవనం నెరపుతాయి. దేశ సామాజిక - ఆర్థికాభివృద్ధిని ప్రణాళికంగా రూపొందించడానికి ప్రాతిపదిక కూడా ప్రవేశపెట్టబడింది.

మార్క్సిస్టు భావంలో లేదా అర్థంలో యిది సోషలిజం కాదనుకోండి : నెహ్రూ సోషలిస్టు విశ్వాసాలు, ఆయన రాజకీయ వాస్తవికవాదిగా రూపొందడాన్ని అడ్డగించలేదు. భారతదేశంలో నెలకొనివున్న వస్తుగత చారిత్రక పరిస్థితులనుండి ఆయన బయలుదేరాడు. దేశంలో వర్గాల, రాజకీయ శక్తుల పొందికను, అలాగే అంతర్జాతీయ పరిస్థితిని పరిగణనలోనికి తీసుకున్నాడు.

సరిగ్గా యీ ఆంతరంగిక పరిస్థితులు, అంతర్జాతీయ పరిస్థితే, భారతదేశంలో నిజమైన సోషలిస్టు పరివర్తనపట్ల ఆసక్తిలేని, అందుకు సిద్ధంగాలేని శక్తులతో దీర్ఘకాలంపాటు రాజీ పడేందుకు ప్రోత్సహించాయి. నెహ్రూ మరో విధంగా వ్యవహరించి వున్నట్లయితే ఆయన జాతికి నాయకుడై వుండేవాడు కాదు; భారతదేశ చరిత్రలో ఒక స్థానం పొందివుండేవాడు కాదు; నవ, శాంతికాముక, ప్రజాతంత్ర భారతదేశ నిర్మాణానికి అంతటి అపారమైన వ్యక్తిగత

1. జవహర్‌లాల్ నెహ్రూ, భారత దర్శనం పుట. 19

కృషి చేయగలిగి వుండేవాడు కాదు. పైగా జాతీయ విముక్తి విప్లవం నుండి తనను దూరం చేసుకొనే ప్రమాదాన్ని ఎదుర్కొని వుండేవాడు.

సోషలిజం యొక్క మానవతావాద అంశాలకు ఎనలేని నిబద్ధత గలవాడు నెహ్రూ; ఇది మానవుని శ్రేయస్సును ఆయా విధానాల హృదయంలో దాస్తుంది. అందువల్లనే సోషలిజం ప్రకటించిన మానవతావాద ఆదర్శాలను సోవియట్ యూనియన్‌లో అలక్ష్యం చేశారన్న ఘటనల గురించి ఆయన ఎంతో వ్యథచెందాడు. ఈ సందర్భంగా, ఎలాంటి భయం లేకుండా యిలా వ్రాశాడు: "అక్కడి పరిణామాలు కొన్నింటిని నేను యిష్టపడేవాణ్ణి కాదు; లేదా అవి నాకు అర్థంకాలేదు. వీటికి, ఆ క్షణంలో వున్న అవకాశవాదానికి, ఆనాడు అధికారానికై సాగే రాజకీయాలతో సన్నిహిత సంబంధం వున్నట్టు నాకు కనపడింది. ఈ పరిణామాలు జరిగినప్పటికీ, సోవియట్ విప్లవం మానవ సమాజాన్ని ఎంతో ముందుకు తీసుకొని పోయిందన్న, ఆర్పివేయడానికి వీలు లేని జ్వాలను రగిలించిందన్న విషయంలో ఎలాంటి సందేహం లేదు."1

సోవియట్ యూనియన్‌లో సోషలిజం వికృత రూపాలపట్ల, ప్రత్యేకంగా స్టాలిన్ నిర్బంధకాండ, దేశ చరిత్రను ఉపేక్షించడం, సోవియట్ పౌరుల హక్కులను, సత్యాలను అన్యాయంగా కుదించటంపట్ల తన ఆదుర్దాను దాచుకొనడం అసాధ్యం అని నెహ్రూ అభిప్రాయపడ్డాడు.

ఈరోజుల్లో, సోవియట్ యూనియన్‌లో పెరిస్త్రోయికా విప్లవ క్రమం సాగుతుండడంతో సోవియట్ ప్రజల మిత్రుడు, వారి భవితవ్యాన్ని గురించి చిత్తశుద్ధితో ఆలోచించిన వ్యక్తియొక్క మంచి విమర్శే యిది అని ప్రతివానికీ తెలుస్తుంది.

సోవియట్ యూనియన్‌లో కొన్ని సోషలిస్టు నిర్మాణ అంశాలకు సంబంధించి ఆయనకు ఎన్ని మినహాయింపులు, వేరే అభిప్రాయాలున్నప్పటికీ నెహ్రూ తన జీవితాంతం వరకు మైత్రీ పూర్వకమైన, విశ్వాసపాత్రమైన భారత-సోవియట్ సంబంధాలను క్రియాశీలంగా బలపరిచే వ్యక్తిగా వున్నాడు. ఈ సంబంధాల సుస్థిరత్వం, శాశ్వత ద్వారాలు, తాత్కాలికమైన పరిగణనలకు గురికాలేదు; అవి కాలపరీక్షలో నిలిచాయి; రాజకీయ సంక్లిష్టతలకు అతీతంగా వున్నాయి. 1986 నవంబరులో తన భారత పర్యటన సందర్భంగా మిహాయిల్ గొర్బచెవ్ యిలా అన్నారు:

1. జవహర్‌లాల్ నెహ్రూ, భారతదర్శనం, పుట 17.

ఈ చారిత్రక కృషికి జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీలు చేసిన దోహదాన్ని సోవియట్ ప్రజలు ఎన్నడూ మరువరు. అత్యంత విలువైన వారి కృషిని ముందుకు తీసుకొనివెళ్ళే, దశాబ్దాలుగా సాధించిన దానికి నూతన దృష్టిని, పుష్టిని కలుగచేస్తూ ఆ తరంనాటి రాజనీతిజ్ఞుల నుండి రాజీవ్‌గాంధీ నేను బాధ్యతలను స్వీకరిస్తున్నాము."

దశాబ్దాలు గడచిపోవచ్చు. కానీ నెహ్రూ శంకుస్థాపన చేసిన, నిర్మించిన భారత-సోవియట్ మైత్రి దృఢపునాది ప్రపంచ శాంతి, ప్రగతికోసం అవిచేసే ప్రయత్నంలో ఆ రెండు దేశాలకు ఉపయుక్తంగా వుంటూనే వుంటాయి.

# నూతన ప్రపంచ వ్యవస్థ అరుణోదయం

అంతర్జాతీయ స్థాయిగల నాయకుడుగా నెహ్రూ, తన స్వంత దేశ జాతీయ ప్రయోజనాలను మొత్తంగా మానవాళి భవితవ్యాన్ని ఒకేవిధంగా పరిగణించాడు. ఏ అగ్రరాజ్యం ముందైనా నిలబడి పూర్తి హోదాతో తన స్వంత అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూనే ఆసియా, ఆఫ్రికాలకు చెందిన సుదూర, విస్తృత ప్రాంతాల నుండి వినవచ్చే "బలహీనమైన" వాణిని ఆయన గౌరవించాడు. ఆయన, అంతర్జాతీయ సంబంధాల్లో మానవతను, సమిష్టి భావనను బలపరిచాడు.

20వ శతాబ్దంలో ప్రపంచం, పెట్టుబడిదారీ పద్ధతుల్లో అభివృద్ధి అయ్యే దేశాలుగా, సోషలిజాన్ని ఎన్నుకొన్న దేశాలుగా చీలిపోయింది. అయితే ఇలా విభజించ బడినప్పటికీ అది మానవాళి సమిష్టి గృహం కాకపోలేదు. అంతర్జాతీయ సంబంధాలు — ఇందులో సకల దేశాలు వున్నాయి — మానవ నాగరికత మనుగడకు అనివార్యమైన షరతుగానే వుంటున్నాయి.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత ప్రారంభం అయిన అణ్వాయుధాల, యితర సామూహిక విధ్వంసక సాధనాలలో అపూర్వమైన పోటీ, అంతం అంటూ లేని "చిన్నపాటి" యుద్ధాలు, అల్పసంఖ్యాక, మత ప్రాతిపదికపై జరిగే ప్రాంతీయ సంఘర్షణలు, ప్రాదేశిక వివాదాలు, ఆసియా, ఆఫ్రికా దేశాల్లో అధికారికంగా సంక్లిష్టమవుతున్న ఆహార సమస్య, అలాగే అభివృద్ధి చెందిన దేశాలకు యీ దేశాలు చెల్లించవలసిన ఆర్థిక ఋణాల పెరుగుదల, నయా వలసవాద విధానం — ఇవన్నీ నెహ్రూను ప్రపంచ వ్యవహారాల్లో నూతన దృక్పథానికై అన్వేషించే విధంగా చేశాయి. నెహ్రూకు ఒక్క విషయం స్పష్టమైంది: అదేమంటే అత్యంత శక్తివంతమైన దేశాలలోని రాజకీయ సంపన్న వర్గాలు, శాస్త్రీయ సాంకేతిక విప్లవాన్ని ఉమ్మడి సంక్షేమం కోసం ఉపయోగించలేక పోయాయి; మానవుని ఉనికికి సంబంధించిన పరిస్థితులను మాన



భారత రిపబ్లిక్ రాజ్యాంగంపై సంతకం చేస్తున్న
ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ



జాతీ యోద్యమ పరిమితి యేమిటో నెహ్రూ ఎరుగును. శ్రామిక ప్రజల ప్రయోజనాల రక్షణకు, తీవ్రమైన సామాజిక మార్పులకు ఈ ఉద్యమాన్ని ఉద్ధృతం చేయవలసిందిగా ఆయన పిలుపు యిచ్చారు. శాస్త్రీయ సోషలిజానికి నిబద్ధత గల వ్యక్తిగా నెహ్రూ తనసుతాను సాహసోపేతంగా ప్రకటించుకున్నాడు. పురోభివృద్ధి చెందిన సోషలిజం విమోచనోద్యమ అంతిమ లక్షణం అని ఆయన ప్రకటించారు. భారత జాతీయ కాంగ్రెస్‌లో కర్షకుల, కార్మికుల భాగస్వామ్యాన్ని పెంచడానికి, వారిని దానిమూల స్థంభంగా రూపొందించడానికి, వారి సామాజిక, ఆర్థిక డిమాండ్లను తీర్చడానికి ఒక ఉద్యమం ప్రారంభించడానికి కృషిచేశాడు.

పీయం చేయలేక పోయాయి; ముఖ్యంగా తృతీయ ప్రపంచంలో యిలా జరిగింది. పైగా ప్రపంచ అణ్వాయుధ ఉపద్రవ ప్రమాదం పెరిగింది.

అందువలన, సకల ప్రజల, దేశాల ప్రయోజనాలకోసం అంతర్జాతీయ సంబంధాలను క్రమబద్ధంచేసే యంత్రాంగం అవసరం వున్నదని నెహ్రూ భావించాడు. ఐక్యరాజ్యసమితి, దాని ప్రాంతీయ ప్రత్యేక సంస్థలు, వీటికితోడు అలీన దేశాల్లో అలాగే ఆఫ్రో - ఆసియా సంఘీభావ దేశాల్లో సహకార చట్రం లోపల బహుళపక్ష దౌత్యం—యిదే ఆ యంత్రాంగంగా వుండాలి.

నెహ్రూ చెప్పినదాని ప్రకారం అమెరికా - సోవియట్ సంబంధాలు మెరుగు పడినప్పుడు మాత్రమే ఐక్యరాజ్య సమితి సమర్థవంతమైన నిర్వహణ, అంతర్జాతీయ న్యాయ సూత్రాల అధికతర పాత్రకు గ్యారంటీ వుంటుంది. ఇలా జరిగితే తూర్పు - పశ్చిమ దేశాల రాజకీయ సంఘర్షణ తగ్గుతుంది. సహృదయుడు, వివేకంగల దౌత్య ప్రతినిధిగా నెహ్రూ, ప్రపంచంలో ఉద్రిక్తతలు సడలిపోవడానికి ప్రధానంగా బాధ్యుడు. ఆయన ప్రాక్పశ్చిమాల అవగాహనకు నిజమైన మధ్యవర్తి.

ఆయన తన అంతర్జాతీయ కార్యకలాపాల ద్వారా చరిత్రాత్మకమైన పాత్ర నిర్వహించాడు; విశ్వజనీనమైన న్యాయం, ప్రజాస్వామ్యం, సకల దేశాలలో నిజమైన సమానతల తక్షణావశ్యకత దృష్ట్యా, అవిభాజ్య, పరస్పరాధీనప్రపంచం అన్న వాస్తవాన్ని అంగీకరించవలసిందని ప్రపంచ రాజకీయ అభిప్రాయాన్ని ఆయన ఒప్పించాడు.

సంకుచిత జాతీయవాద, వర్గ లేదా బృందాల యొక్క లక్ష్యాల కంటే సర్వసాధారణ మానవ ప్రయోజనాలు మిన్నయని గుర్తించిన నెహ్రూ దీనిని రాజకీయ ఆచరణలో చూపించాడు. "మంచి" లేదా "చెడ్డ" రాజకీయవాదుల వాంఛ ఎలా వున్నప్పటికీ నిజ జీవితంలో, సాధారణ మానవ ప్రయోజనాలు, ఒక బృందం లేదా వర్గ ప్రయోజనాల మధ్య అలాగే జాతీయ, అంతర్జాతీయ ప్రయోజనాల మధ్య ఎల్లప్పుడూ ఒక నిర్దిష్టమైన సంబంధం వుంటుందనీ, యీ ప్రయోజనాలు తరచు తమ మధ్య తాము తీవ్ర సంఘర్షణ పడుతుంటామని ఆయన కచ్చితంగా అంగీకరించాడు. ఆయన వాస్తవిక వాది. ఒక సామాజిక—ఆర్థిక వ్యవస్థ స్థానే మరొక దానికి స్వచ్ఛందంగా అవకాశం కల్పించు తుందని లేదా తన ప్రయోజనాలకు విరుద్ధంగా ఒక దోపిడీవర్గం తాను పీడించే వారిపట్ల ప్రేమతో వుంటుందని ఆయన ఆశించలేదు. అయినప్పటికీ యీ రెంటికీ — వాటిమధ్య విభేదాలు, వైరుధ్యాలు ఉన్నప్పటికీ - కూడా ఉమ్మడి ప్రయోజనాలు, సారూప్యత గల లక్ష్యాలు వున్నాయని నెహ్రూ విశ్వసించాడు.

కల్పించింది. ఈనాడు, యీ అణుయుగంలో, స్వేచ్ఛాయుత దేశాలను అణచివేసేందుకు వలసవాద దేశాలు ఉపయోగిస్తున్న ఆయుధాలు మరింత భయంకరంగా తయారవుతున్నాయి; మానవజాతి మనుగడకే విపత్తును కలిగిస్తున్నాయి.

అమెరికా అణుబాంబు దుష్ట సంకేతాన్ని వ్యాఖ్యానించడంలో నెహ్రూ అద్భుతమైన రాజకీయ అంతర్ దృష్టిని ప్రదర్శించాడు. 1945 సెప్టెంబరులో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ, ఆయన చొరవపై ఒక తీర్మానాన్ని ఆమోదించింది అందులో యిలా వున్నది:

"ప్రపంచయుద్ధం ఆనందంగా ముగిసింది; అయితే దాని నీలినీడలు యింకా ప్రపంచాన్ని చీకటి చేస్తున్నాయి; భవిష్యత్తు యుద్ధాల అవకాశాల గురించి చర్చిస్తున్నారు. అణుబాంబు యుద్ధ ఆయుధంగా ప్రత్యక్షమైంది. భయంకరమైన, దారుణమైన విధ్వంసక శక్తులతో ప్రత్యక్షమైన ఈ అణు బాంబు ప్రపంచంలో యీనాడున్న రాజకీయ, ఆర్థిక, ఆత్మిక వ్యవస్థలోని నీతిబాహ్య, ఆత్మ వినాశకర శక్తులను ఒక సంక్షోభంలోనికి తెచ్చింది. అది తన సామ్రాజ్యవాద, స్వాయత్త ధోరణులను వదలుకొంటేతప్ప, స్వేచ్ఛాయుత దేశాల శాంతియుత సహకారం, మానవుని గౌరవ ప్రపత్తులను కొనసాగించడం అన్న వాటిపై ఆధారపడితే తప్ప నాగరికత తనను తానే ధ్వంసం చేసుకొంటుంది.

అవి నలభైకి పైగా సంవత్సరాల క్రిందట వ్రాయబడినప్పటికీ యీ మాటలు నూతన చింతనలో చేదు నిజం అనే తళుకులు కాదా?!

ఇది యిలా వుండగా, ప్రజలకు నిజం దాచడానికి వారి అప్రమత్తతను మొద్దుబార చేయడానికి, ప్రపంచం చుట్టూ దృశ్యమానమైన నూతన చింతనా జ్వాలలను ఆర్పివేసేందుకు, ప్రజల్లో అంతర్‌దృష్టి వెలుగులను ప్రసరించకుండా నిరోధించేందుకు పశ్చిమదేశాలు తాము చేయగల ప్రచారాన్నంతా చేస్తున్నాయి. పాత యుద్ధ సిద్ధాంత జడత్వం మానవాళి అధికారికంగా సంక్షోభంలో కూరికొనిపోతున్నది.

ఈ భూమండలంలో జీవనం శాశ్వతమా లేక తాత్కాలికమా అన్న ప్రశ్నకు సమాధానాన్ని రహస్యంగా వుంచాలని నెహ్రూ ప్రయత్నించలేదు. ప్రజల ప్రవర్తనపైన, వారి నాయకుల కార్యకలాపాలపైన, వాటియొక్క మానవతావాద విశిష్టత, సమిష్టి మూలాలు, సమిష్టి భవితవ్యాలను సకల ప్రభుత్వాలు గుర్తించడంపైన—ఈ భూమండలంపై జీవనం ఆధారపడి వున్నదని ఆయన అవగాహన; అలాగే పురాతన ప్రపంచంలోని విభిన్న దేశాలకు



తన జీవితంలో నిజమైన అనుచరురాలు, మిత్రురాలు అయిన
కుమార్తె ఇందిరతో జవహర్‌లాల్ నెహ్రూ



ఆసియా దేశాల మధ్య శాంతియుత సహజీవనానికి సంబంధించిన పంచశీల సూత్రాల ప్రబోధకులలో ఒకడు నెహ్రూ. చరిత్రాత్మకమైన బాండుంగ్ మహాసభ నిర్వాహకులలో ఒకడు. ఇది 1955లో జరిగింది. నయావలస వాదానికి, జాత్యహంకారానికి వ్యతిరేకంగా, శాంతి, స్వాతంత్ర్యం, సామాజిక, ఆర్థిక ప్రగతి కోసం నూతనంగా విముక్తి పొందిన ఆసియా, ఆఫ్రికా దేశాలను సమీకరించే క్రమంలో యిది ఒక ప్రముఖ ఘట్టం.

భిన్నమైన చరిత్ర వుందనీ, ఈ నూతన ప్రపంచంలో ప్రజలందరి భవితవ్యం ఎలాంటి మినహాయింపులు లేకుండా అవిభాజ్యం అన్న తిరుగులేని వాస్తవాన్ని అర్థం చేసుకొనడంపై ఆధారపడివుంది అన్నది ఆయన అవగాహన. ప్రపంచం, ఐక్యత, పరస్పరాధారిత్వం కలిగివుంది. ఏ ఒక్కడూ తనకుతానై పరిష్కారాన్ని అన్వేషించలేడు. ఈ భూమండలంలో దేవుడు, దయ్యమూ తన నివాసులందరికీ సర్వసామాన్యమవుతున్నాయి.

ప్రపంచ ఐక్యత అంటే దాని అర్థం అది మరింత సామరస్యంగానూ, సరళంగానూ, మరింత అజమాయిషీ చేయగలదిగానూ వున్నదన్న అర్థం ఏమాత్రం కాదు. బహుశా తద్విరుద్ధం: ప్రపంచానికి అపరిష్కృత సమస్యలు అనేకం వున్నాయి; వాటి సంఖ్య పెరుగుతూనే వుంది. ఈనాడుసైతం దానికి మరిన్ని సామాజిక, ఆర్థిక, జాతీయ, సైద్ధాంతిక, జీవ్యావరణ వైరుధ్యాలున్నాయి. వీటిని పరిష్కరించడం మరింత కష్టమవుతున్నది. ఈ సమస్యలు, వైరుధ్యాలనుండి తప్పించుకొనే ప్రశ్నే లేదు. అంతమాత్రాన నిరాశపడడానికి హేతువులేదు: చరిత్ర, మానవాళి తగు సమయంలో వాటిని పరిష్కరిస్తాయి. మనం అనేక సమస్యలతో, వైరుధ్యాలతో జీవించగలం, సర్దుకుపోగలం. అయితే అందులో ఒకటి ఎంతమాత్రం సహించరానిది — అదే శాంతిసమరాల మధ్య వైరుధ్యం. ఈ వైరుధ్యం యిప్పటికీ ప్రపంచ మానవాళికి అతి ఘోరమైన ప్రమాదాన్ని కలిగిస్తున్నది. అణ్వాయుధాల సమక్షంలో మనం జీవించజాలం. ఎందుకంటే ఎలాంటి పొరపాటు ప్రయత్నాలు మనల్ని బూడిదగా మార్చుతాయి.

నెహ్రూ, యుద్ధము, శాంతి సమస్యను అలా ఆలోచించాడు. ఉన్మత్త ఆయుధ పోటీలో, సామూహిక విధ్వంసక నూతన ఆయుధాలను కనిపెట్టడంలో, మానవుడు తన సరిహద్దును దాటాడనీ, యీ సరిహద్దు తర్వాత హేతువాద శక్తి అంటూ వుండజాలదని హెచ్చరిస్తూ ఐక్యరాజ్యసమితిలో, యితర అంతర్జాతీయ వేదికలపై నెహ్రూ ప్రసంగాలు చేశాడు, ప్రకటనలు యిచ్చాడు. ప్రకృతి మానవునికి హేతుబుద్ధిని ప్రసాదించి విశ్వాసంతో అతనికి శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞాన గవాక్షాలను తెరచింది. అయితే తన సునిశితమైన మేధస్సుకు అందుబాటులోవున్న ప్రతిపని మానవుడు చేయరాదు. ఉదాహరణకు, నేరస్థపూర్వక బాధ్యతారాహిత్యంతో దారుణమైన విధ్వంసక శక్తులతో ప్రయోగాలు చేయరాదు; మీదుమిక్కిలి, సామాజిక — రాజకీయ సమస్యల పరిష్కృతికి లేదా శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాల సాయంతో తన ప్రపంచ ఆధిపత్యాన్ని స్థాపించడానికి వాటిని ఉపయోగించాలని తాపత్రయపడగూడదు.

1940 లో నెహ్రూ యిలా వ్రాశాడు : "మానవుని మనస్సు సంఘటనల క్రమానికి వెనుకబడివుంటుందనీ, మెల్లగా వాటితో సర్దుబాటు చేసుకుంటుందని గత సంఘటనల సుదీర్ఘ చరిత్ర మనకు తెలియచేస్తున్నది." 1

వాస్తవం చెప్పాలంటే, 20 వ శతాబ్దం శీఘ్రగతిన ప్రపంచ ముఖ చిత్రాన్ని మార్చివేస్తున్నది. ప్రపంచం కొద్ది దశాబ్దాల క్రిందటికంటే చాలా మారిపోయింది. కాలానికి తన స్వంత స్వభావాలు వున్నాయి; దానికి తన స్వంతస్థాయి విజ్ఞానం వుంది, నైతిక విలువలకు సంబంధించిన అభిప్రాయాలున్నాయి; తన స్వంత సమస్యలు, విజయాలు వున్నాయి. కాలం మనతో జీవిస్తుంది. అది మనలో భాగం. రెండవ ప్రపంచయుద్ధం కాలం నాడు ఆలోచించిన రీతిలో యింకా ఆలోచించడాన్ని తరచు కొనసాగిస్తూ, కాలం చెల్లిన మూసపోసిన తరహా పద్ధతులను అంటిపెట్టుకొని వుంటూ అనేకమంది ప్రజలు అనునిత్యం శీఘ్రగతిన సాగిపోతున్న కాలంతో ముందుకు సాగలేక వెనుకడగు వేస్తున్నప్పటికీ మానవాళి మొత్తంగా యిట్టే కదలిపోతున్న కాల ప్రవాహంతోపాటు సాగిపోవాలి; దాని స్వభావాలు, లక్షణాలు, అంతర్గతసార భూతాంశాలకు అనుగుణంగా నడుచుకోవాలి.

దేశాలమధ్య శాంతియుత సహజీవనం, సహకారం అన్న సూత్రాన్ని బొదలదాల్చుతూ నెహ్రూ, ఈ సూత్రానికి మధ్యేమార్గంగానీ, ప్రత్యామ్నాయం గానీ లేదని పునరుద్ఘాటించాడు. "పాత విభజనలకు, అధికార రాజకీయ తృష్ణకు యీనాడు అర్థంలేదు — అవి మన పర్యావరణంలో యిమడవు. అయినప్పటికీ అవి కొనసాగుతున్నాయి." అని ఆయన వ్రాశాడు. దేశాల ప్రయోజనాలు, కార్యకలాపాలు తమ సరిహద్దులను పొంగిపొర్లుతున్నాయి; అవి ప్రపంచవ్యాపితంగా వున్నాయి. ఏ దేశమూ యితర దేశాల రాజకీయ, ఆర్థిక భవితవ్యానికి సంబంధం లేకుండా ఒంటరిగా వుండలేదు; విముఖతా భావంతో వుండలేదు. సహకారం అంటూ లేకపోతే సంఘర్షణ తప్పదు; అందువల్ల అనివార్యమైన ఫలితాలు కలుగకమానవు. సమానత, పరస్పర శ్రేయస్సు ప్రాతిపదికపై, అలాగే వెనుకబడిన దేశాలను, ప్రజలను ఒకే రకమైన సంక్షేమం, సాంస్కృతిక పురోభివృద్ధి స్థాయికి తీసుకరావడం, జాత్యాహంకారం, పెత్తందారీతనాల నిర్మూలన ప్రాతిపదికపై మాత్రమే సహకారం వుండగలదు. ఏ దేశము, ఏ ప్రజలు, యీ పెత్తందారీతనాన్ని మరొకర్ని దోచుకొనడాన్ని —దీనికి ఏదో ముద్దుపేరు పెట్టినప్పటికీ— సహించరు. ప్రపంచంలోని యితర భాగాలవారు సౌభాగ్యంతో వర్ధిల్లుతున్నప్పుడు వీరు

1. జవహర్‌లాల్ నెహ్రూ, భారత దర్శనం పుట. 552.

తమ స్వంత దేశంలోని దారిద్ర్యం, బాధలపట్ల వైముఖ్యం ప్రదర్శించలేరు. బయట ప్రపంచంలో యేమి జరుగుతుందో తెలియనప్పుడు మాత్రమే యిది సాధ్యమవుతుంది."1 అని నెహ్రూ వ్రాశాడు.

నెహ్రూను 20వ శతాబ్దం ఉత్తమ వ్యక్తుల్లో చేర్చడం న్యాయం. ప్రజల, ప్రభుత్వాల, దేశాల ఆలోచనారీతుల్లోనూ, అవి కాలంతో ప్రవర్తించే పద్ధతుల్లోనూ ప్రమాదకరమైన అసమంజసత్వాన్ని ఆయన చూశాడు, అర్థం చేసుకున్నాడు. పైగా, సాధ్యమైనంతవరకు ఆయన, విప్లవకరమైన మార్పులకు గురైన ప్రపంచ రాజకీయాలకు మానవజాతి జీవన పరిస్థితులకు మధ్య ఏర్పడిన ప్రమాదకర అగాధాన్ని తగ్గించడానికి ప్రయత్నించాడు.

నెహ్రూ కొన్ని సందర్భాల్లో పచ్చి భావవాదిగా కనపడతాడు: అహింసను ఆయన విశ్వసించాడు. (తన గురువైన మహాత్మాగాంధీలా ఎలాంటి మినహాయింపులులేని వ్యక్తిగా కాకుండా) ధర్మము, మనస్సాక్షి, సిగ్గు, దయ, న్యాయము అన్న శాశ్వతమైన భావనలు అంతర్జాతీయ సంబంధాలను ఆత్మికమైనవిగా చేయడానికి అవసరమని విశ్వసించేట్టు ప్రజలను ప్రేరేపించాలని నెహ్రూ ప్రయత్నించాడు; అలాగే మానవుల హుందాతనానికి, మానవ హక్కులకు అధికతర ప్రాధాన్యతనిస్తూ ప్రభుత్వాలు తమ విధానాలను నైతికంగా ఒక ధృడమైన పునాదిమీద వుంచేట్టు చేయాలని ఆయన ప్రయత్నించాడు.

నెహ్రూ రాజకీయ భావవాదంకంటే మరింత ఆచరణీయమైనది మరొకటి వుండదు. అహింస, న్యాయం నైతిక భావనలు అని ఆయనకు సంపూర్ణంగా ఎరుగును. రానున్న కాలంలో మానవాళి వాటిని అంతర్జాతీయ సంబంధాల యొక్క తిరుగులేని న్యాయ నియమాలలో చేర్చుకొంటుందని ఆయన విశ్వసించాడు.

ప్రపంచ రాజకీయాలకు సంబంధించి నెహ్రూ యొక్క నైతికంగా ఉన్నత స్థాయిలో వున్న దృక్పథం ఎల్లప్పుడూ కాలంయొక్క నిర్దిష్ట వాస్తవాలకు అనుగుణంగా వుండేది. ఉదాహరణకు దుస్సాహసిక శక్తిని ప్రజలు ఒనరించే కేవలం త్యాగాలతోకూడిన అహింసతో ఎదుర్కొనడు; అలాగే హద్దూ అపులేని ఆయుధ పోటీని ఏకపక్ష నిరాయుధీకరణతో ఎదుర్కొనడు; లజ్జాకరమైన విధంగా ప్రజలను బానిసలుగా మార్చడాన్ని, స్వచ్ఛందంగా వారు కడగండ్లపాలయ్యే విధానంతో ఎదుర్కొనడు. ఈ విషయంలో నెహ్రూ ఆచరణవాది.

1. జవహర్‌లాల్ నెహ్రూ, భారత దర్శనం. పుట 552.

జవహర్‌లాల్ నెహ్రూ మన సమకాలికుడుగా నిలిచిపోతాడు. ఆయన అంతర్జాతీయ చొరవలు, భావనలు, ప్రత్యక్ష చర్యలు యీనాటికీ కాలానుగుణ మైనవి. అవి తమ నిర్మాణాత్మక స్వభావాన్ని కోల్పోలేదు; లేదా చరిత్ర లోతుల్లోకి కూరుకొనిపోలేదు. అవి యింకా పనిచేసే గుణం కలిగివున్నాయి. నూతన రాజకీయ చింతన ఆవిర్భవించడంతో ఇప్పుడు నాటిల్లో చాలా ఫల ప్రదంగావడం ప్రారంభించాయి. నెహ్రూ ఆశావాది. తన హేతుబద్ధమైన, దయాపూర్వక చర్యలు శాశ్వతంగా లాభదాయకంగా వుంటాయని ఆలోచించే వాడు. శాంతియుత సహజీవ సూత్రం అమలుకై ప్రధానమైన ఆవశ్యకతగా మన యుగంలో ఒక నూతన చారిత్రకి అవసరం ఉద్భవిస్తుందని — యీ అవసరాన్నే అంతర్జాతీయ సంబంధాల్లో సిద్ధాంతరాద్ధాంతాలు చూపించలేక పోవడం అని పేరు పెట్టారు — వాస్తవంగా ఆయన ముందే వూహించాడు. ఈ సిద్ధాంత ప్రతిపాదినే సోవియట్ యూనియన్, భారత దేశాల నాయకులు మిహాయిల్ గొర్బచేవ్, రాజీవ్ గాంధీలు సంతకాలు చేసిన అణ్వాస్త్రరహిత, అహింసారహిత ప్రపంచ స్థాపనా సూత్రాల ఢిల్లీ ప్రకటనకు ప్రాతిపదిక అయింది.

శాంతియుత సహజీవన సూత్రం అంతర్జాతీయ సంబంధాల్లో విశ్వజనీన మైన నియమంగా వుండాలని ఢిల్లీ ప్రకటన తెలుపుతున్నది. అది విశ్వజనీన మైన నియమం ఎందుకంటే అది ఒక్క గట్టి పునాది. దీనినే ప్రభుత్వాలు తమ ప్రవర్తనను ఆధారం చేసుకుంటాయి; దీనిమీదనే అహింసా ప్రపంచం యొక్క మొత్తం భవనం నిర్మించబడుతుంది. శాంతియుత సహజీవనం అంటే: యుద్ధాన్ని విసర్జించడం, వివాదాస్పద సమస్యల పరిష్కారానికి మార్గంగా బలాన్ని ఉపయోగించడం లేదా బలప్రయోగానికి పాల్పడతామని బెదిరించడం విసర్జించడం; సంప్రదింపులద్వారా సంఘర్షణల పరిష్కారం; యితరుల అంతరంగిక విషయాల్లో బేజోక్యం, అన్ని పక్షాల న్యాయ సమ్మత మైన ప్రయోజనాలను పరిశీలించడం; ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కు, దేశాల సార్వభౌమాధికారాన్ని ప్రాదేశిక సమగ్రతను వు.చ. తప్పకుండా గౌరవించడం, అలాగే వాటి సరిహద్దులను ఉల్లంఘించకపోవడం; సంపూర్ణ సమానత, పరస్పర లాభదాయకతల ప్రాతిపదికగా సహకారం; సార్వజనీ నంగా గుర్తించబడిన అంతర్జాతీయ న్యాయసూత్రాల నుండి ఉద్భవించిన బాధ్యతలను ఆత్మ ప్రబోధంతో నెరవేర్చడం, కుదుర్చుకున్న సంధులను ఒప్పందాలను అంగీకరించడం.

హింస, యుద్ధం అనే సిద్ధాంతం, అసమానతను స్థాపించి కొనసాగించడం, యితరులు కొందరిని పీడించడం, జాతి, మత వివక్షతలు కొనసాగించడం— వీటినన్నింటినీ నిషేధించాలని ఆనాడు నెహ్రూ డిమాండ్ చేశాడు — అన్నవి ఢిల్లీ ప్రకటనలో నీతిబాహ్యమైనవిగా, అనుమతించరానిదిగా ప్రకటించారు.

పరస్పర అవగాహన, విశ్వాసాలు, ప్రపంచంలో ఉద్రిక్తతలను కల్పించే భీతి, అనుమానాల స్థానే రావాలి - పాత మూసపోసిన పద్ధతులలోనే వ్యవహరించే వారు సృష్టించిన విద్రోహకర విదేశీ శత్రువు అనే దారుణమైన చిత్రణ స్థానే భూమండలంపై విశ్వసనీయమైన భాగస్వామి, శాంతియుతమైన మైత్రీ పూర్వక సహనివాసి అన్న చిత్రణ రావాలి. మన మానవ సమాజంలో జీవనం అహింస ప్రాతిపదికగా వుండాలి. జాతీయ భద్రతకు ఆధునిక ఆయుధాలు ప్రాతిపదిక అనే పూర్వపు భావనలు, యుద్ధాలను ("అవి పరిమితమైనవైనా", "ఎదురుదెబ్బ తీసేవైనా", "స్థానికమైనవి" లేదా "తక్కువ స్థాయిలోనైనా") ప్రభుత్వ వైఖరిజాన్ని ఏ రూపంలోనైనా అనుమతించడం ఈనాడు ప్రమాద భూయిష్టమైన సాహసంగా, మానవాళిపై నేరంగా మారుతున్నాయి.

భారత-సోవియట్ ఢిల్లీ ప్రకటనలో నెహ్రూ శాంతి ఆదర్శాలున్నాయి. చింతనాశీలిగా, మానవతామూర్తిగా ఆయన యీ ప్రకటనలోని ప్రతి పేరాను హర్షించి వుండేవాడు. మానవాళిని ఎదుర్కొంటున్న ప్రధాన కర్తవ్యాలను రూపొందిస్తూ ఈ ప్రకటన వాటిని సాధించే మార్గాన్ని కూడా సూచించింది. అదే సమగ్ర అంతర్జాతీయ భద్రతా వ్యవస్థ. భద్రతను సంరక్షించడానికి వీలుగా దేశాలు, వాటి నాయకులు, నిరాయుధీకరణకు, అభివృద్ధికి తమ నిబద్ధతను తెలియచేయాలి; తనిఖీ చేసేందుకు అందుబాటులోవున్న అంగీకృత మార్గాలను ఉపయోగించడం ద్వారా, దేశాలమధ్య విశ్వాసాన్ని పెంపొందించడం ద్వారా అణు నిరాయుధీకరణకుగల తక్షణ చర్యలను అమలుపరచాలి; సంప్రదింపులు, రాజకీయ, ఆర్థిక, మానవతావాద రంగాల్లో సహకార మార్గాల ద్వారా ప్రాంతీయ సంఘర్షణలకు న్యాయమైన రాజకీయ పరిష్కారాన్ని కనుగొనాలి.

నెహ్రూ యొక్క అకలంక దేశభక్తి, ప్రజాతంత్రవాదం, మానవతావాదం, వలసవాద హింస, జాతివివక్షతలకు వ్యతిరేకంగా ఆయన నిరంతర పోరాటం, సామ్రాజ్యవాదాన్ని, యుద్ధాన్ని ఆయన తీవ్రంగా ఖండించడం, సార్వజనీన నిరాయుధీకరణకు, అణ్వాయుధాల నిషేధానికి, దేశాల, ప్రజల విస్తృత అంతర్జాతీయ సహకారానికి నిరంతరం ఆయన యిచ్చిన పిలుపులు— యివన్నీ ఢిల్లీ ప్రకటనలో పూర్తిగా ప్రతిబింబించాయి; రాజకీయంగా నిర్ధారణ చేయబడినాయి.

నెహ్రూ వంటి శాంతి యోధుల పుణ్యమా అని ప్రపంచ వ్యాపితంగా ప్రజల వైఖరులు, మన నాగరికత మారుతున్నాయి. యుద్ధాలు సంభవించక తప్పదు అన్న వికృత భావనలచేత ప్రజల మనస్సులు విషతుల్యం చేస్తున్న దేశాలలో ఒక నూతన చింతన ఉద్భవిస్తున్నది, వేళ్ళూనుకొంటున్నది: దేశాలు శాంతియొక్క మానవతావాద సిద్ధాంతాన్ని జీర్ణించుకొంటున్నాయి. శతాబ్దాలుగా ప్రజలమధ్య యుద్ధాలను పెంచిపోషించిన "శతృభావన" లేదా "శతృ చిత్రణ" స్థానే కొంత కష్టంగానైనా, మానవాళి ఐక్యతలో, దేశాలమధ్య సోదరత్వం, భాగస్వామ్యాలలో ప్రజా విశ్వాసం అన్నవి ఏర్పడుతున్నాయి.

కాలం, సజీవమూర్తి అయిన నెహ్రూ నుండి మనల్ని నిర్దయగా విడదీస్తున్నది. అయితే ఆయన రాజకీయ వారసత్వం ప్రజల హృదయాలను, మనస్సులను గెలుస్తున్నది; అంతర్జాతీయ న్యాయరూపాలను, ఆకృతులను సంతరించుకొనడం ప్రారంభించింది. ఈ వారసత్వం, ప్రగతిశీల ప్రభుత్వాల విదేశాంగ విధానాలను మానవీయం చేయడంలో ఒక గర్భితశక్తిగా రూపొందుతున్నది.

గడచిపోతున్న దశాబ్దాలు, నెహ్రూ యొక్క ఆత్మిక వైభవానికి, చారిత్రక దృష్టికి ప్రతీకలుగా వుంటున్నాయి. యాభై సంవత్సరాలనాడు సాధ్యయోగ్యం కావనీ, వృధాప్రయాస అనీ లేక భ్రమలతో కూడినవనీ అనుకొన్న, శతాబ్దాలకైనా లేదా సహస్రాబ్దులకైనా సాధింప వీలులేనివనీ భావించిన ఆయన ఆదర్శ ప్రపంచంలోని నిజాలు, అంశాలు ఈనాడు కాలం ఇచ్చే ఆదేశాలుగా, ఆజ్ఞలుగా రూపొందుతున్నాయి. అంతర్జాతీయ సంబంధాల ఆచరణలో అవి తిరుగులేని శక్తిగా వుంటాయి.

నొవోస్తీ పత్రికా సంస్థ (ఎ.పి.యన్.) సోవియట్ ప్రభుత్వ సంస్థల సమాచార సంస్థ. "శాంతి, ప్రపంచమైత్రికి సమాచారం" అన్నది దీని లక్ష్యం.

ఎ.పి.యన్, 140 దేశాల్లో 45 భాషల్లో సచిత్ర పత్రికలను, వార్తా పత్రికలను, మాగజైన్‌లను (వార పత్రికలు, ద్వైవార పత్రికలు, మాస పత్రికలు) ప్రచురించి, పంపిణీ చేస్తుంది.

నొవోస్తీ ప్రచురణలు, సోవియట్ యూనియన్ దేశీయ, విదేశాంగ విధానం గురించీ, జీవనం గురించీ, ఆర్థిక వ్యవస్థ, శాస్త్రవిజ్ఞానం, సంస్కృతి, కళలు, విద్య, క్రీడలు తదితర రంగాల్లో సోవియట్ ప్రజల సమస్యలు, విజయాల గురించీ, అలాగే ప్రపంచంలోని వివిధ దేశాలలో సోవియట్ సంబంధాలు సహకారం గురించీ సమాచారాన్ని ఇస్తుంది.

—:o:—